# వైరుధ్యం గురించి



## మావో సే టుంగ్

అనువాదం : ఇంగువ మల్లికార్జున శర్మ

# వైరుధ్యం గురించి*

## 1937 ఆగష్టు

వస్తువులలోని వైరుధ్య సూత్రం, అంటే విరుద్ధాంశాల ఐక్యతా సూత్రం, భౌతికవాద గతితర్కపు ప్రాథమిక సూత్రం. " సముచితమైన అర్థంలో గతితర్కం అంటే వస్తువుల అసలు సారాంశంలోనే వుండే వైరుధ్యాన్ని అధ్యయనం చేయడమే "[1] నని లెనిన్ అంటాడు. లెనిన్ తరచూ ఈ సూత్రాన్ని గతితర్క సారాంశమని పేర్కొంటుండేవాడు. ఆయన దీన్ని గతితర్కపు అసలు చేవ అనికూడ అన్నాడు.[2] కనుక ఈ సూత్రాన్ని

---

* ఈ తత్వ వ్యాసాన్ని కామ్రేడ్ మావో సే టుంగ్ " ఆచరణ గురించి " వ్యాసం రాసిన తర్వాత రాసాడు. ఆ కాలంలో పార్టీలో నెలకొనివుండిన పిడివాద ఆలోచనా ధోరణికి చెందిన తీవ్ర తప్పిదాన్ని అధిగమించే ధ్యేయంతోనే ఆయన దీన్నికూడ రాసాడు. ఇది మొదట్లో యెనాన్‌లోని జపాన్ వ్యతిరేక సైనిక, రాజకీయ కళాశాలలో ప్రసంగాలుగా యివ్వబడింది. ఆనక దీన్ని ఆయన ఎంపిక చేసిన రచనల లో చేర్చినప్పుడు ఆయనే స్వయంగా దీన్ని సరిచూచారుకూడ.

[1] హెగెల్ యొక్క *తత్వశాస్త్ర చరిత్రపై ప్రసంగాలు, సంపుటి 1,* లోని ఏలియాటిక్ తత్వకూటమి పై లెనిన్ రాసుకున్న నోట్సునుండి. చూడు : వి.ఐ. లెనిన్, హెగెల్ యొక్క *తత్వశాస్త్ర చరిత్రపై ప్రసంగాలు పై* సమగ్ర వీక్షణ (1915), *సేకరించిన రచనలు,* రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పు. 249.

[2] తన *గతితర్క సమస్యపై* (1915) వ్యాసంలో లెనిన్ యిలా అన్నాడు : " ఒకే పూర్తి మొత్తాన్ని రెండుగా చీల్చడం, దాని విరుద్ధ భాగాలను ఎరుకగావించుకోవడం (హెరాక్లిటస్ పై లాసాలే రచించిన పుస్తకంలో జ్ఞానగ్రహణంపై (On Cognition) అనే 3వ ప్రకరణం మొదట్లో హెరాక్లిటస్‌పై ఫిలో చేసిన వ్యాఖ్య చూడండి) అనేది గతితర్కంలోని సారాంశం ( దాని ధర్మాలు, లక్షణాల్లో ఏకైక ప్రధానాంశం కాకున్నా, ఎటుబడీ దాని ప్రధాన ధర్మాలు, సారాంశ లక్షణాల్లో ఒకటైనది)" [ *సేకరించిన రచనలు,* రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పు. 357 ]. అలాగే తన " హెగెల్ యొక్క తర్క శాస్త్రవిజ్ఞానం పై సమగ్ర దృష్టి " (1914 సెప్టెంబరు - డిసెంబరు) లో లెనిన్ యిలా అన్నాడు : " క్లుప్తంగా, గతితర్కమంటే విరుద్ధాంశాల ఐక్యతా సిద్ధాంతమని నిర్వచించవచ్చు. ఇది గతితర్కపు గుజ్జును పట్టుకున్నట్లే గాని దీనికి యింకా వివరణలూ, వికాసమూ అవసరం పడుతాయికూడ " ( పై పుస్తకమే, పు. 215).

అధ్యయనం చేసేటప్పుడు మనం వివిధ రకాల ప్రశ్నలను, అనేక తాత్విక సమస్యలను ఎదుర్కొనక తప్పదు మరి. ఈ సమస్యలన్నింటినీ మనం స్పష్టంగా తెలుసుకొనగల్గితే, అప్పుడు మనం భౌతికవాద గతితర్కం గురించి ఒక మౌలిక అవగాహనకు రాగల్గుతాము. మనకు ఎదురయ్యే సమస్యలు : రెండు ప్రాపంచిక దృక్పథాలు, వైరుధ్యం విశ్వజనీనత (universality), వైరుధ్యం ప్రత్యేకత (particularity), ప్రధాన వైరుధ్యం – వైరుధ్యంలో ప్రధాన లక్షణం, వైరుధ్యంలోని లక్షణాల మధ్య అభిన్నత – పోరాటం, వైరుధ్యంలో వైరానికి వున్న చోటు.

ఇటీవలి సంవత్సరాలలో సోవియట్ తాత్విక వర్గాల్లో డెబోరిన్ తత్వకూటమి [3] యొక్క భావవాదంపై చెలరేగిన తీవ్రవిమర్శ యిక్కడ

---

[3] డెబోరిన్ (1881-1963) ఒక సోవియట్ తత్వవేత్త; సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ యొక్క విజ్ఞానశాస్త్రాల అకాడమీ సభ్యుడుకూడ. డెబోరిన్ తత్వకూటమి సిద్ధాంతాన్ని ఆచరణనుండి, తత్వచింతనను రాజకీయాలనుండి వేరుచేసిచూచే తప్పులకు పూనుకున్నది. దానితో 1930 నుండి సోవియట్ యూనియన్‌లోని తాత్విక వర్గాల్లో ఈ తప్పులు భావవాద స్వభావంగలవంటూ విమర్శలు మొదలయ్యాయి.

**డెబోరిన్, అబ్రాం మొయిజేయెవిచ్ :** 1881 జూన్ 16వ తేదీన రష్యన్ సామ్రాజ్యంలో భాగమైవుండిన (యిప్పుడు స్వతంత్ర దేశమైన) లిథువేనియాలోని ఉపీనాలో ఒక దిగువ మధ్య తరగతి రష్యన్ యూదు కుటుంబంలో జన్మించిన, అయోఫే అనికూడ పిలవబడే, డెబోరిన్ 1903లోనే లెనినిస్టు బోల్షివిక్ వుద్యమంలో చేరాడు. కాని 1905 విప్లవంతర్వాతి కాలంలో ప్లెఖనోవ్ ప్రభావంకిందకు వచ్చాడు. 1907లో బెర్న్ (జర్మనీ) విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్ర అధ్యయనం చేసాడు; 1908లో పట్టా పుచ్చుకున్నాడు. 1917దాకా మెన్షివిక్కుగావున్న అతడు అక్టోబరు విప్లవానంతరం మళ్లీ బోల్షివిక్కుల వైపుకు వచ్చాడు. 1921 లో స్వెర్డ్‌లోవ్ యూనివర్సిటీలో తత్వశాస్త్ర ఆచార్యునిగా నియమించబడ్డాడు. పెద్దయెత్తున, ఒక వరదలా, తత్వశాస్త్రవిషయాలపై రచనలు, ప్రచురణలు చేయసాగాడు. అప్పట్లో సోవియట్ మార్క్సిస్టు తాత్విక రచనలు, ప్రచురణలన్నింటికీ ప్రధాన సంపాదకుడుగానూ, తాత్వికవర్గాల్లో మేటిగా పరిగణింపబడుతూనూ వుండేవాడు. హెగెల్ తత్వాన్ని గంభీరంగా అధ్యయనంచేసి, మార్క్సిస్టు తత్వాన్ని ప్రధానంగా హెగెల్ వివరించిన గతితర్కం ఆధారంగా, ప్రకారంగా వ్యాఖ్యానించే దిట్టగా పేరుపొందాడు. మార్క్సిజంలోకి మాక్ యొక్క పాజిటివిజాన్ని(నిశ్చయసత్యవాదాన్ని), ఫ్రాయిడ్‌యొక్క (సెక్స్ ఆధారిత) మనస్తత్వవిశ్లేషణావాదాలను జొప్పించే ధోరణులు అప్పట్లో సోవియట్ మార్క్సిస్టుల్లో గణనీయంగానే వుండినాయి. మార్క్సిస్టేతర తాత్వికధోరణులపైకూడ విమర్శలు విసురుతూవచ్చినా డెబోరిన్ ప్రధానంగా మార్క్సిస్టుశ్రేణుల్లోనే తలయెత్తిన పై రెండు ధోరణులపై తన నిశిత విమర్శనాస్త్రాలు సంధించాడు. " గతితర్కానికి మద్దతుగా సాంఘిక వుద్యమం " అంటూ తాత్వికవర్గాల్లో ముమ్మరమైన విమర్శ, ప్రచారాల కార్యక్రమాలు చేపట్టాడు.

మనలో సైతం ఎంతో ఆసక్తి రేకెత్తించింది. డెబోరిన్ భావవాదం మన చైనా కమ్యూనిస్టు పార్టీపై చాల దుష్ప్రభావం నెరపింది. మన పార్టీలో నెలకొన్న పిడివాద ఆలోచనా ధోరణికీ, ఈ డెబోరిన్ తత్వకూటమి వైఖరికీ నడుమ సంబంధమేదీ లేదనీ అనుకోలేము. అందుచేత ఈ పిడివాద ఆలోచనా ధోరణిని రూపుమాపడమే యిప్పుడు మనం చేసే తత్వశాస్త్ర అధ్యయనానికి ప్రధాన ధ్యేయంగా వుండాలి.

---

1929 ఏప్రిల్‌లో మాస్కోలో జరిగిన మార్క్సిస్టు-లెనినిస్టు మేధావుల సంస్థల రెండవ సాధారణ సమావేశంలో డెబోరిన్ పేరుప్రతిష్ఠలు మున్నెన్నడూ లేని ఉచ్ఛస్థాయి నందుకోవడమేగాక తాత్వికరంగంలోకూడ రాజకీయపర శాసనాలు చేసే ఒక అవాంఛనీయ క్రమంకూడ అక్కడే మొదలైంది. అందులో మార్క్సిస్టు గతితర్కానికి డెబోరిన్ యిచ్చిన వివరణలను అధికారికంగా, లాంఛనంగా ఆమోదించడమేగాక, యాంత్రిక భౌతికవాదం, పాజిటివిజాలు "సరియైనవి కావు", "మార్క్సిజానికి విరుద్ధం"(లేదా మార్క్సిస్టేతరం - un-Marxist) అనే నిరసన ముద్రలుకూడ వేసేశారు. అయితే డెబోరిన్ ప్రాముఖ్యం, జనాకర్షణ (popularity) ఎట్టేకాలం నిలవలేదు. ఒక ఏడాది తిరగకుండానే అతడు స్టాలిన్ ఆగ్రహానికి గురికావల్సివచ్చింది. డెబోరిన్‌ను విమర్శిస్తూ, అతడు "తత్వశాస్త్రాన్నీ, ఆచరణనూ వేరుచేసి చూస్తున్నాడు," "మెన్షివిక్కు భావవాదం ప్రచారంచేస్తున్నాడు" అని స్టాలిన్ తీవ్ర ఆరోపణలు చేశాడు. అంటే అప్పటి కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ, దాని అధినేత స్టాలిన్ చేసే భాష్యాలను అతడు అంగీకరించకపోవడమన్న మాట. దానితో 1931 జనవరిలో డెబోరిన్ భావాలు, వివరణలు "సరియైనవి కావు", "మార్క్సిజానికి విరుద్ధం" అంటూ మరొక రాజకీయ మేధోశాసనం జారీ అయింది. పర్యవసానంగా డెబోరిన్ తన పేరుప్రతిష్ఠలు, సంపాదక, ఆచార్య పదవులు కోల్పోయాడు. కాని, అదృష్టవశాత్తూ, అంతకుమించి ప్రమాదాలకు గురికాలేదు; మరికొందరు సహచరుల విషయంలోలా "ప్రజాశత్రువు"గానైతే నిరసింపబడలేదు. కాకపోతే స్టాలిన్ చనిపోయేదాకా(1953దాకా) తన రచనావ్యాసంగాన్ని కట్టిపెట్టి, విజ్ఞానశాస్త్రాల అకాడమీలో ఏవైనా చిన్నపాటి సంపాదక కార్యకలాపాలకుమాత్రమే పరిమితంకావల్సి వచ్చింది. స్టాలిన్ మరణానంతరం డెబోరిన్ క్రమేపీ తన పేరుప్రతిష్ఠలు గణనీయంగా పునరుద్ధరించుకోవడమేగాక, గంభీరంగా రచనలు చేయసాగాడుకూడ. రెండు సంపుటాల "ఆధునిక కాలపు సాంఘిక-రాజకీయ సిద్ధాంతాలు" అనే బృహద్గ్రంథం రచన పూర్తిచేసిన పిదప, వృద్ధాప్యంలో జబ్బుతో తీసుకుని 1963 మార్చి 8వ తేదీనాడు మాస్కోలో కన్నుమూసాడు. డెబోరిన్ ముఖ్య రచనలు కొన్ని : *గతితార్కిక భౌతికవాద తత్వపరిచయం* (పెట్రోగ్రాడ్, 1916), *చింతకునిగా లెనిన్*(మాస్కో, 1924), *తత్వశాస్త్రం - మార్క్సిజం*(మాస్కో, 1926), *గతితర్కం - ప్రకృతి విజ్ఞానశాస్త్రం*(మాస్కో, 1928), *లెనిన్ - ఆధునిక భౌతికశాస్త్ర సంక్షోభం*(మాస్కో, 1930), *తత్వశాస్త్రం - రాజకీయాలు*(మాస్కో, 1961), *ఆధునిక కాలపు సాంఘిక-రాజకీయ సిద్ధాంతాలు* (సంపుటం 1, మాస్కో, 1958) [డెబోరిన్ మరణానంతరం రెండవ సంపుటం ప్రచురింపబడుతుందని ప్రకటించారుగాని ఆ విషయమై ఏ సంగతీ యింకా తెలవలేదు].

# 1. రెండు ప్రాపంచిక దృక్పథాలు

మానవ జ్ఞాన చరిత్ర అంతటా విశ్వవికాస సూత్రాలని గురించి రెండు భావనలు - అధిభౌతిక భావన, గతితార్కిక భావనలు - పుంటూవస్తున్నాయి. ఇవి రెండూ పరస్పర విరుద్ధమైన రెండు ప్రాపంచిక దృక్పథాలను పొందుపరుచుకున్నాయి. ఇందుకు సంబంధించి లెనిన్ యిలా అంటాడు :

**అభివృద్ధి (పరిణామం)కి సంబంధించిన రెండు ప్రాథమిక (లేక రెండు సాధ్యమైన? లేక రెండు చారిత్రకంగా గమనించ శక్యమయ్యే?) భావనలు :- హెచ్చు తగ్గులుగా, ఒక పునశ్చరణగా (పర్విత చర్వణంగా), అభివృద్ధి సంభవిస్తుందనేదీ ; కాదు, విరుద్ధాంశాల ఐక్యతగా (ఒక ఐక్యత పరస్పరం వేరైన విరుద్ధాంశాలుగా విడిపోతూ, అవి రెండూ ఒకదానిపై మరొకటి ప్రభావం కలగజేస్తూ పరస్పర సంబంధం కలిగివుండడంగా) అభివృద్ధి సాగుతుందనేదీనూ.**[4]

ఇక్కడ లెనిన్ యీ రెండు విభిన్న ప్రాపంచిక దృక్పథాలనుగురించే ప్రస్తావిస్తున్నాడు.

చైనాలో అధిభౌతిక వాదానికి మరో పేరు సువాన్ సుయే. చైనాలోనేగానీ, ఐరోపా ఖండంలోనేగానీ చరిత్రలో అతి దీర్ఘ కాలంపాటు భావవాద ప్రాపంచిక దృక్పథంలో అభిన్న భాగమైన యీ అలోచనా ధోరణే మానవుల ఆలోచనలపై ప్రాబల్యం నెరపే స్థితిలో వుండింది. ఐరోపాలో తొలికాలాల్లోని బూర్జువావర్గ భౌతిక వాదంకూడ అధిభౌతిక తత్వంతోనే వుండింది. అనేక ఐరోపా దేశాల సాంఘిక ఆర్థిక వ్యవస్థలు బాగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ విధానం దశకు పురోగమించే కొద్దీ, ఉత్పత్తి శక్తులు, వర్గ పోరాటం, విజ్ఞాన శాస్త్రాలు చరిత్రలో అపూర్వ స్థాయికి అభివృద్ధి చెందిన కొద్దీ, [పర్యవసానంగా] పారిశ్రామిక అట్టడుగు కార్మిక వర్గం (proletariat) చారిత్రక వికాసానికి అత్యంత మహత్తర చోదక శక్తిగా రూపొందిన కొద్దీ, భౌతికవాద గతితర్కానికి సంబంధించిన మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథం అవతరించింది. అప్పుడు ఈ భౌతికవాద గతితర్కాన్ని ఎదిరించడానికిగాను

---

4 వి.ఐ. లెనిన్, " గతితర్కం సమస్యపై " (1915), సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పు. 358.

అప్పటికే వున్న, బాహాటంగా, నగ్నంగా అభివృద్ధినిరోధకమైన, భావవాదానికి తోడుగా ఒక తుచ్ఛ పరిణామ వాదం (vulgar evolutionism) కూడ పుట్టుకొచ్చింది.

అధిభౌతిక లేక తుచ్ఛ పరిణామవాద ప్రాపంచిక దృక్పథం వస్తువులను వేర్వేరై ఒంటరిగా వుండేవి(isolated) గా, నిశ్చలమైనవి (static) గా, ఏకపక్షమైనవి (one-sided) గా చూస్తుంది. ఈ విశ్వంలోని సమస్త వస్తువులూ, వాటి రూపాలూ, వాటి జాతివిశేషాలూ(species) అన్నీ శాశ్వతంగా ఒకదాన్నుండి మరొకటి వేరుపడి, ఒంటరివిగానూ, అపరివర్తనీయం (immutable) గానూ వున్నట్లు ఈ అధిభౌతిక దృక్పథం పరిగణిస్తుంది. ఒక వేళ మార్పంటూ ఏమైనావున్నా అది పరిమాణంలో హెచ్చు తగ్గులుగామాత్రమే, లేక స్థితి(స్థాన) మార్పుగా మాత్రమే వుండగలదని, అంతేగాక యిలాంటి హెచ్చు తగ్గులకు లేక స్థాన మార్పులకు కారణం ఆయా వస్తువుల లోపల గాక, వాటికి బయటమాత్రమే వుంటుందని - అంటే వాటి చోదకశక్తి బాహ్యమైనదిగానే వుంటుందనికూడ ఈ తుచ్ఛ పరిణామవాదులు అంటారు. ఈ విశ్వంలోని నానావిధాలైన వస్తువులూ, వాటి రకరకాల నిజలక్షణాలూ అన్నీకూడ అవి అస్తిత్వంలోకి వచ్చినప్పటినుండి నేటిదాకా కూడ ఎట్టి మార్పులకూ లోనుకాకుండా ఉన్నవి వున్నట్లుగానే కొన సాగుతున్నాయని యీ అధిభౌతికవాదులు భావిస్తారు. తర్వాత వచ్చిన మార్పు లేవైనా అన్నీ కేవలం పరిమాణంలో సంభవించిన వృద్ధి, క్షయాలు మాత్రమే నంటారు. ఒక వస్తువు ఎప్పుడూ అదే విధమైన వస్తువుగా పునరావృ తమౌతూంటుందే గాని తద్భిన్నమైన మరి దేనిగానూ మార్పు చెందజాలదని వీళ్లు వాదిస్తారు. పెట్టుబడిదారీ దోపిడీ, పెట్టుబడిదారీ పోటీ, పెట్టుబడిదారీ సమాజపు వ్యక్తివాద భావజాలం మొదలైనవన్నీకూడ మనం ప్రాచీన బానిస సమాజంలో, ఆ మాటకు ఆదిమ సమాజంలోసైతం, కనుగొనగలమనీ, అవన్నీ అలాగే మారకుండా సదా శాశ్వతంగా నిలిచివుంటాయనీ వీళ్లంటారు. సాంఘికాభివృద్ధి కారణాలను వీళ్లు సమాజానికి బాహ్యంగా వుండే భూగోళం, వాతావరణ పరిస్థితులు వగైరా కారణాంశాలకు ఆపాదిస్తుంటారు. ఒక వస్తువు వికాసానికి కారణాలను వీళ్లు మరీ సులభసరళమైన రీతిలో, దాని బయటి పరిసరాల్లో వెదుకుతుంటారు. ఏ అభివృద్ధి అయినా వస్తువులోపలే వుండే వైరుధ్యాలనుండి సంభవిస్తుందనే భౌతికవాద గతితర్క సిద్ధాంతాన్ని

తిరస్కరిస్తుంటారు. పర్యవసానంగా వీళ్లు వస్తువుల పరిమాణాత్మక వైవిధ్యతను గాని, లేదా ఒక గుణం మరొక గుణంగా మారే పరిణామాన్నిగాని వివరించలేక పోతారు. ఐరోపా ఖండంలో ఈ ఆలోచనా విధానం 17, 18వ శతాబ్దాల్లో యాంత్రిక భౌతికవాదంగానూ, 19వ శతాబ్దపు చివరి, 20వ శతాబ్దపు ఆరంభ కాలంలో తుచ్ఛ పరిణామవాదంగానూ చలామణీలో వుండింది. చైనాలోకూడ, " స్వర్గం మారదు, అలాగే టావోకూడ మారదు "[5] అనే సూక్తిలో వ్యక్తమయ్యేటటువంటి ఒకానొక అధిభౌతికవాద ఆలోచనా ధోరణి వ్యాప్తిలో వుండేది. ఈ ధోరణిని క్షీణదశలోవున్న భూస్వామ్య పాలకవర్గాలు దీర్ఘకాలంపాటు బలపరుస్తూ వచ్చాయి. పోతే గత వంద సంవత్సరాల కాలంలో ఐరోపానుండి దిగుమతైన యాంత్రిక భౌతికవాదం, తుచ్ఛ పరిణామవాదాలకు బూర్జువా వర్గం అండదండలు లభిస్తున్నాయి.

అధిభౌతికవాద ప్రాపంచిక దృక్పథానికి విరుద్ధంగా, ఒక వస్తువు అభివృద్ధిని అవగాహన చేసుకోవాలంటే మనం దానిని అంతర్గతంగానూ, యితర వస్తువులతో దానికి వుండే సంబంధాలలోనూ చూచి అధ్యయనం చేయాలని భౌతికవాద గతితార్కిక ప్రాపంచిక దృక్పథం భావిస్తుంది. మరో విధంగా చెబితే, వస్తువుల అభివృద్ధి క్రమాన్ని వాటి అంతర్గత, ఆవశ్యక స్వయంచలనంగా గుర్తెరగాలని, యిలాంటి స్వయంచలన క్రమంలో ప్రతి వస్తువూ దాని చుట్టూవుండే వివిధ యితర వస్తువులతో పరస్పర సంబంధాలు కలిగివుంటూ, వాటితో పరస్పర చర్యలు జరుపుకుంటూ వుంటుందని గ్రహించాలనడ మన్నమాట. ఒక వస్తువు అభివృద్ధికి మౌలిక కారణం బాహ్యమైనది కాదు, అంతర్గతమైనదే. వస్తువులోపలే వుండే విరుద్ధత (contradictoriness) లోనే ఈ కారణం యిమిడివుంటుంది. ప్రతి ఒక్క వస్తువులోనూ అంతర్గత విరుద్ధత వుంటుంది; దానివల్లనే ఆ వస్తువుకు చలనం, అభివృద్ధి కలుగుతుంటాయి. ఒక వస్తువు అభివృద్ధికి దానిలోని అంతర్గత విరుద్ధత మౌలిక కారణం, కాగా దానికి యితర వస్తువులతో వుండే పరస్పర సంబంధాలు, పరస్పర చర్యలు రెండవ [ప్రాధాన్యతగల ] కారణాలు మాత్రమే. ఈ విధంగా చెబుతూ భౌతికవాద గతితర్కం, అధిభౌతికవాద యాంత్రిక భౌతికవాదం, తుచ్ఛ పరిణామవాదాలు

---

[5] హాన్ రాజవంశంలో కన్‌ఫ్యూషియస్ సిద్ధాంతాలకు ప్రముఖ భాష్యకారునిగా వుండిన టుంగ్ చుంగ్ షూ (క్రీ.పూ. 179-104) సూక్తి యిది.

ముందుకు తెచ్చే బాహ్య కారణాలు లేదా బాహ్య చోదక శక్తుల సిద్ధాంతాన్ని సమర్థవంతంగా ఎదుర్కొంటుంది. శుద్ధ బాహ్య కారణాలు మాత్రమేనైతే యాంత్రిక చలనాన్ని, అంటే పరిమాణం లేక స్థాయి(ప్రమాణం - scale )లో మార్పులను మాత్రమే జనింపజేయగలవని, అంతే తప్ప వస్తువులు పరస్పరం గుణాత్మకంగా వేలాది విధాలుగా ఎందుకు విభేదిస్తుంటాయి, ఒక వస్తువు మరొకదానిగా ఎందుకు మారుతుంది అనే విషయం వివరించలేవనేది సుస్పష్టమే. నిజానికి, బాహ్యశక్తి ప్రేరణవల్ల జనించే యాంత్రిక చలనంకూడ వస్తువుల అంతర్గత విరుద్ధతద్వారానే సంభవిస్తుందని గమనించాలి. అదేవిధంగా, జంతువులూ, చెట్టూ చేమల సామాన్య పెరుగుదల - వాటి పరిమాణాత్మక అభివృద్ధి - కూడ ముఖ్యంగా వాటి అంతర్గత వైరుధ్యాల ఫలితమే. అలాగే సాంఘిక వికాసంకూడ బాహ్య కారణాలవల్ల కాక ప్రధానంగా అంతర్గత కారణాలవల్లే సంభవిస్తుంది. ఇంచుమించు ఒకే విధమైన భౌగోళిక, వాతావరణ పరిస్థితులు వుండే దేశాలైనా, వాటి వాటి అభివృద్ధుల్లో మాత్రం ఎంతో వైవిధ్యత, అసమానతలు నెలకొనివుండడం గమనిస్తాము. పైగా ఒకే దేశంలో, దాని భౌగోళిక స్థితిగతులు, వాతావరణ పరిస్థితులు మారకుండా వున్నప్పటికీ, మహత్తర సాంఘిక పరివర్తనలు సంభవించవచ్చు. రష్యా, జపాన్ దేశాలు రెంటిలో దేనిలోనూ భౌగోళిక, వాతావరణ మార్పులు సంభవించకున్నా, సామ్రాజ్యవాద రష్యా, సోషలిస్టు సోవియట్ యూనియన్‌గా మారింది; బయటి ప్రపంచానికి తలుపులు బిడాయించుకుని కూర్చునివుండిన ఫ్యూడల్ జపాన్, సామ్రాజ్యవాద జపాన్‌గా మారింది. చిరకాలంగా భూస్వామ్య విధానం పెత్తనంకిందవున్న చైనా గత వందేళ్ల కాలంలో మహత్తర మార్పులకు లోనైంది; ప్రస్తుతం అది విముక్త, స్వతంత్ర నవ చైనాగా అవతరించే దిశగా మార్పు చెందుతున్నది. అయితే చైనా భౌగోళిక, వాతావరణ పరిస్థితుల్లోమాత్రం ఎలాంటి మార్పులు సంభవించలేదనేది గమనార్హం. [అంటే భౌగోళిక, వాతావరణ పరిస్థితుల్లో మార్పులు అసలేవీ సంభవించవని కాదు;] ఈ భూమి మొత్తంలోనూ, దీనిలోని ప్రతి భాగంలోనూ, భౌగోళిక, వాతావరణ పరిస్థితుల్లో మార్పులు సంభవిస్తూనే వుంటాయనేది నిజమే. కాని, సమాజంలో సంభవించే మార్పులతో పోలిస్తే అవి అంత లెక్కలోకి రానివని తెలియాలి. భౌగోళిక, వాతావరణ పరిస్థితుల్లో మార్పులు దశ సహస్రాబ్దాల కాలావధుల (పదేసి వేల ఏళ్ల అవధుల) లెక్కన సంభవిస్తుంటాయి; కాగా

సాంఘిక మార్పులు సహస్రాబ్దాలు, శతాబ్దాలు, దశాబ్దాల అవధుల లెక్కన సంభవిస్తుంటాయి, విప్లవ కాలాల్లోనైతే యీ మార్పులు కొన్ని సంవత్సరాలు లేక నెలల అవధుల్లోకూడ జరగవచ్చు. భౌతికవాద గతితర్కం ప్రకారం ప్రకృతి మార్పులు ముఖ్యంగా ప్రకృతిలోని అంతర్గత వైరుధ్యాల మూలంగా సంభవిస్తుంటాయి. అలాగే సంఘంలో మార్పులు ప్రధానంగా సమాజంలోని అంతర్గత వైరుధ్యాల మూలంగా సంభవిస్తుంటాయి. అంటే, ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాల నడుమ గల వైరుధ్యాలు, వర్గాల మధ్యలి వైరుధ్యాలు, పాత, కొత్తల మధ్యగల వైరుధ్యాల మూలంగా నన్నమాట. సమాజాన్ని ముందుకు తోసుకువెళ్లేదీ, పాత సమాజాన్ని అధిగమించి నవ సమాజం అవతరించడానికి ప్రేరణ నిచ్చేదీ ఈ వైరుధ్యాల వికాసక్రమమే.

అంటే భౌతికవాద గతితర్కం బాహ్యకారణాలను అసలు పరిగణనలోకే తీసుకోకుండా తోసివేస్తుందా ? కానే కాదు. కాకపోగా, అంతర్గత కారణాలు మార్పుకు వలసిన ప్రాతిపదికగా వుంటే, బాహ్య కారణాలు మార్పుకు వలసిన ఆవశ్యకస్థితి అని, అంతర్గత కారణాలద్వారా ఈ బాహ్య కారణాలు పనిచేస్తాయని అది (భౌతికవాద గతితర్కం) భావిస్తుంది. తగిన ఉష్ణోగ్రతవద్ద గుడ్డునుండి కోడిపిల్ల పుట్టుకొస్తుందిగాని, ఎంత ఉష్ణోగ్రతయినా రాయిని కోడిపిల్లగా మార్చలేదు. ఎందుకంటే, వీటిలో ప్రతిదానికీ ఒక విభిన్న ప్రాతిపదిక వుంది గనుక. వివిధ దేశాల ప్రజలమధ్య నిరంతర పరస్పరచర్యలు వున్నాయి. పెట్టుబడిదారీ యుగంలో, ప్రత్యేకించి సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవాల యుగంలో, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో వివిధ దేశాల నడుమ ఎంతో మహత్తరమైన పరస్పర చర్యలు, పరస్పర ప్రభావాలు వుంటాయి. అక్టోబర్ సోషలిస్టు విప్లవం ప్రపంచ చరిత్రలో, అలాగే రష్యా చరిత్రలోనూ, ఒక నూతన శకాన్ని ఆవిష్కరించింది. అది ప్రపంచంలోని ఇతరేతర దేశాల్లోని అంతర్గత మార్పులపై ప్రభావం నెరిపింది. అదే విధంగా, ప్రత్యేకించి మరింత ప్రగాఢంగా, చైనాలో అంతర్గత మార్పులపైకూడ ఆ విప్లవం ప్రభావం కలగజేసింది. అయితే చైనాతోసహా యిలాంటి దేశాలన్నింటిలోనూ వాటివాటి ఆంతరంగిక అభివృద్ధి సూత్రాలద్వారా ఈ మార్పులు సంభవించాయి. యుద్ధంలో ఒక పక్షం గెలుస్తుంది, మరొకటి ఓడిపోతుంది. ఉభయ సేనల జయాపజయాలూ అంతర్గత కారణాలవల్లే నిర్ణీతమౌతాయి. అది బలవత్తరంగా వుండడంవల్లో లేక దానికి సమర్థవంతులైన సైన్యాధిపతులు

వుండడంవల్లో ఒకటి గెలిస్తే, బలహీనంగా వుండడంవల్ల లేక అసమర్థ సైన్యాధిపత్యంవల్ల మరొకటి ఓటమి పాలయివుంటుంది. ఏమైనా అంతర్గత కారణాలద్వారానే బాహ్య కారణాలు పని చేస్తాయని గమనించాలి. చైనాలో 1927లో బడా బూర్జువావర్గం చేతుల్లో కార్మికవర్గం ఓటమి చెందిందంటే, అప్పట్లో అసలుకు చైనా కార్మికవర్గం లోపలే (అంటే చైనా కమ్యూనిస్టు పార్టీలో) నెలకొనివుండిన అవకాశవాదంవల్లే - తద్వారానే - అదలా జరిగింది. మన మీ అవకాశవాదాన్ని ఏరిపారవేయగానే, చైనా విప్లవం మళ్లీ ముందంజ వేయ నారంభించింది. తదనంతరం, మన పార్టీలో దుస్సాహసవాదం (adventurism) తలెత్తినందువల్ల, మన (చైనా) విప్లవం మళ్లీ శత్రువు చేతుల్లో తీవ్ర ఓటములకు గురై, వెనుకంజ పట్టింది. ఆనక మనం ఈ దుస్సాహసవాదాన్ని రూపుమాపగానే, మన ఆశయం మళ్లీ ముందంజ వేయసాగింది. కనుక ఏదైనా రాజకీయ పార్టీ ఒక విప్లవాన్ని విజయోన్ముఖంగా నడిపించాలంటే, అది స్వీయ రాజకీయ విధానపు సవ్యతపైన, స్వీయ నిర్మాణ పటిష్టతపైనే ఆధారపడాల్సి వుంటుందని గ్రహించగలం.

గతితార్కిక ప్రాపంచిక దృక్పథం ప్రాచీన కాలాల్లో చైనాలోను, ఐరోపాలోను ఉభయత్రా ఆవిర్భవించింది. అయితే ఈ ప్రాచీన గతితర్కం కొంత అయత్నపూర్వక, భోళాతనపు స్వభావం కలిగివుండింది. అప్పట్లో వున్న సాంఘిక, చారిత్రక పరిస్థితుల్లో అది ఒక సిద్ధాంత వ్యవస్థను రూపొందించుకొనేంత దూరం వెళ్లలేక పోయింది. అందుచేత అది ప్రపంచాన్నిగురించి సమగ్రంగా వివరించలేక, అధిభౌతికవాదానికి తావిచ్చి తప్పుకోవాల్సివచ్చింది. అనంతరం 18వ శతాబ్దపు తుది, 19వ శతాబ్దపు తొలి భాగాల్లో జీవించిన జర్మనీదేశ మహాతాత్వికుడు హెగెల్ ఈ గతితర్కానికి అత్యంత ముఖ్యమైన దోహదం చేశాడు గాని ఆయనది భావవాద గతితర్కం. తర్వాత, కార్మిక వర్గ వుద్యమ మహారథులైన మార్క్స్, ఏంగెల్సులు మానవజ్ఞాన చరిత్రలోని నిశ్చయాత్మక సిద్ధితాలను (positive achievements) సంయోగపరిచి, ప్రత్యేకించి హెగెల్ ప్రతిపాదిత గతితర్కంలోని సహేతుక అంశాలను విమర్శనాత్మకంగా విలీనంచేసుకుని, గతితార్కిక, చారిత్రక భౌతికవాద మహా సిద్ధాంతాన్ని సృష్టించినప్పుడే మానవ జ్ఞానపురోగమన చరిత్రలో ఒక అపూర్వ విప్లవం సంభవించింది. ఈ సిద్ధాంతాన్ని లెనిన్, స్టాలిన్‌లు యింకింత అభివృద్ధి చేశారు. ఈ సిద్ధాంతం

చైనాకు వ్యాపించగానే, చైనాదేశ చింతనా ప్రపంచంలో బ్రహ్మాండమైన మార్పులు కొనివచ్చింది.

ఈ గతితార్కిక ప్రాపంచిక దృక్పథం మనకు ప్రాథమికంగా వివిధ వస్తువుల్లోని విరుద్ధాంశాల చలనాన్ని ఎలా గమనించి, విశ్లేషించాలో, యిలాంటి విశ్లేషణ ప్రాతిపదికన వైరుధ్యాల పరిష్కారానికి తగిన పద్ధతుల్ని ఎలా సూచించాలో బోధిస్తుంది. అందువల్ల వస్తువుల్లోని వైరుధ్య సూత్రాన్ని ఒక నిర్దిష్ట పద్ధతిలో అర్థం చేసుకోవల్సిన అతిముఖ్యమైన అవసరం మనకుంది.

## 2. వైరుధ్యం విశ్వజనీనత

**( Universality Of Contradiction )**

వివరణాసౌలభ్యంకోసం నేను మొదట వైరుధ్యం విశ్వజనీనతగురించి వ్యవహరిస్తాను. ఆనకే వైరుధ్యం ప్రత్యేకత (particularity) గురించి వివరిస్తాను. కారణమేమంటే, వైరుధ్యం విశ్వజనీనతను మరింత సంక్షేపంగా వివరించవచ్చును; ఎందుకంటే, మార్క్సిజాన్ని సృష్టించిన, కొనసాగిస్తున్న మహోపాధ్యాయులు - మార్క్స్, ఏంగెల్సు, లెనిన్, స్టాలిన్‌లు - ఈ భౌతికవాద గతితార్కిక ప్రాపంచిక దృక్పథాన్ని కనుగొని, మానవ చరిత్రలో, ప్రకృతి చరిత్రలో అనేక కోణాలను విశ్లేషించడానికి, సమాజం, ప్రకృతులకు సంబంధించిన అనేక అంశాలను (సోవియట్ యూనియన్‌లోలా) మార్చడానికి భౌతికవాద గతితర్కాన్ని ఎంతో జయప్రదంగా అన్వయించినప్పటినుండీ దీన్ని (వైరుధ్యం విశ్వజనీనతను) విస్తృతంగా గుర్తిస్తున్నారు గనుక. కాగా వైరుధ్యం ప్రత్యేకతను యిప్పటికీ అనేకమంది కామ్రేడ్లు, ప్రత్యేకించి పిడివాదులు, స్పష్టంగా అర్థం చేసుకోలేదు. సరిగ్గా ఈ వైరుధ్యం ప్రత్యేకతలోనే వైరుధ్యం విశ్వజనీనత నెలకొనివుంటుందని వాళ్లు అర్థం చేసుకోవడం లేదు. అలాగే, విప్లవ ఆచరణ క్రమంలో మనకు సరైన దారిచూపించడానికిగాను, మనకు ఎదురుపడే వివిధ నిర్దిష్ట వస్తువుల్లోని వైరుధ్య ప్రత్యేకతలను అధ్యయనం చేయడం ఎంత ముఖ్యమోకూడ వారికి బోధపడడంలేదు. కనుక వైరుధ్యం ప్రత్యేకతను అధ్యయనం చేయడంపట్ల విశేష శ్రద్ధాసక్తులు చూపించాల్సిన, దాన్నిగురించి తగినంత దీర్ఘవివరణ యివ్వాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఈ కారణంచేత, వస్తువుల్లోని వైరుధ్యసూత్రాన్ని విశ్లేషించేటప్పుడు మనం మొదటిగా వైరుధ్యం

విశ్వజనీనతను విశ్లేషిద్దాం; ఆనక వైరుధ్యం ప్రత్యేకతను విశ్లేషించడంపై ప్రత్యేక శ్రద్ధ వహిద్దాం; చివరకు మళ్లీ వైరుధ్యం విశ్వజనీనతకు మళ్లివద్దాం.

వైరుధ్యం విశ్వజనీనత లేక అఖండత (absoluteness)కు రెండందాల అర్థముంది. ఒకటి, సకల వస్తువుల అభివృద్ధిక్రమంలో వైరుధ్యం మనివుంటుందని. మరొకటి, ప్రతి వస్తువు అభివృద్ధి క్రమంలోనూ మొదలునుండి తుదిదాకా విరుద్ధాంశాల చలనం వుంటుందని.

**"స్వయానా చలనమే ఒక వైరుధ్యం,"**[6] అని ఏంగెల్సు అంటాడు. కాగా, విరుద్ధాంశాల ఐక్యతా సూత్రమంటే, " **(సమాజం, మనస్సులతో సహా) ప్రకృతిలోని సమస్త పరిణామాలు, క్రమాల్లోనూగల విరుద్ధమైన, పరస్పరం వేర్వేరుగావుండే, ఎదురుబొదురు ధోరణులను గుర్తించడం (కనుగొనడం)"** అని లెనిన్ నిర్వచిస్తాడు.[7] ఈ అభిప్రాయాలు సరైనవేనా ? ఔను, సరైనవే. అన్ని వస్తువుల్లోనూవుండే విరుద్ధ అంశాల పరస్పర ఆధారత, ఈ అంశాలనడుమ పోరాటం ఆ వస్తువులన్నింటి జీవితాన్ని నిర్ణీతంచేస్తూ, వాటి అభివృద్ధిని ముందుకు తోసుకుపోతూవుంటాయి. వైరుధ్యం కలిగివుండనిదంటూ ఏదీ లేదు; వైరుధ్యం లేకుండా ఏదీ మనలేదు.

వైరుధ్యం సులభసామాన్య చలనరూపాలకు (ఉదాహరణకు, యాంత్రిక చలనానికి) ప్రాతిపదికగా వుంటుంది. అలాగే సంక్లిష్ట చలనరూపాలకుసైతం మరింత ఆవశ్యక ప్రాతిపదికైవుంటుంది.

వైరుధ్యం విశ్వజనీనతను ఏంగెల్సు యిలా వివరిస్తాడు :

**సులభసామాన్యమైన యాంత్రిక చలనమే వైరుధ్యాన్ని కలిగివుంటే, మరింత ఉన్నత పదార్థచలన రూపాలకుసంబంధించి, ప్రత్యేకించి సేంద్రియ ప్రాణులు, వాటి జీవితవికాసానికి సంబంధించి, యిది (వైరుధ్యం) మరింత సత్యంగా మనివుంటుంది**

---

6 ఫ్రెడరిక్ ఏంగెల్స్, "గతితర్కం – పరిమాణం, గుణం, " యాంటీ డ్యూరింగ్ (1877-78), ఇంగ్లీషు ప్రచురణ, విదేశ భాషా ప్రచురణాలయం, మాస్కో, 1959, పు. 166.

7 వి.ఐ. లెనిన్, " *గతితర్కం సమస్యపై* " (1915), సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పుటలు 357-358.

..... జీవితమంటే ప్రాథమికంగా, కచ్చితంగా అర్థమేమంటే ఒక జీవి (being) అనుక్షణమూ తన స్వయంసత్తుగా, అదే సమయంలో అందుకు భిన్నమైన యింకేదైనా సత్తుగా వుండడమేనని గ్రహించాలి. కనుక జీవితంకూడ ఒక వైరుధ్యమే; స్వయానా వస్తువులు,క్రమాల లోపలే అంతర్గతంగా వుంటూ, నిరంతరం పుట్టుకువస్తూ, తన్నుతాను పరిష్కరించుకుంటూవుండే వైరుధ్యం. ఈ వైరుధ్యం నిలిచిపోయిన తక్షణమే జీవితంకూడ ముగిసిపోతుంది, మృత్యువు రంగప్రవేశం చేస్తుంది. అదే విధంగా, ఆలోచనా రంగంలోనైనా మనం వైరుధ్యాలనుండి తప్పించుకోలేమనికూడ గమనిస్తాము. ఉదాహరణకు జ్ఞానార్జనా సామర్థ్యం మనిషికి స్వతస్సిద్ధంగానైతే అపరిమితంగా వుంటుంది. కాని ఈ సామర్థ్యం బాహ్యంగా పరిమితులై, పరిమిత జ్ఞానగ్రహణా శక్తి మాత్రమే కలిగివుండేటటువంటి వ్యక్తుల్లోనే యథార్థంగా నిలిచివుంటుంది. ఈ రెండు అంశాలమధ్య వైరుధ్యం ఎలా పరిష్కార మవుతుందంటే, కనీసం మనకు సంబంధించినంతవరకు వ్యవహారాచరణలోనైతే, ఒక అనంత ప్రగతిక్రమంలో మానవజాతి తరతరాలుగా అంతులేకుండా సాగి పోతూండడంద్వారానే యిది పరిష్కారమౌతుంది.

... ఉన్నత గణితం(పెద్దలెక్కలు)లోని ప్రాథమిక సూత్రాల్లో ఒకటికూడ ... వైరుధ్యం ...

అయితే సామాన్య గణితం(చిన్నలెక్కలు)లోకూడ వైరుధ్యాలు పుష్కలంగా వున్నాయి ...[8]

వైరుధ్యం విశ్వజనీనతకు లెనిన్ యిలా ఉదాహరణ లిస్తాడు :

లెక్కలలో : + మరియు – ; అవకలనం, సమాకలనం (differential, integral).

---

[8] ఫ్రెడరిక్ ఏంగెల్స్, పై పుస్తకమే, పుటలు 166-67. [ కొన్ని సందర్భాల్లో సరళరేఖలు, వక్రరేఖలు ఒకటేనని చెప్పడం, మన కంటి ఎదుట పరస్పరం ఖండించుకునే రేఖలు కేవలం అంతకు 4-5 సెంటిమీటర్లముందు సమాంతరంగా, అంటే అనంతంగా పొడిగించినా పరస్పరం ఖండించుకోనివిగా వున్నట్లు చూపడం ఉన్నతగణితంలోనూ, రుణాత్మక రాశి దేనికీ వర్గఫలం (square) గావుండలేదంటూనే √ -1 (-1కు వర్గమూలం) గా ఒక ఊహాసంఖ్య ( i ) ను తీసుకుని క్లిష్టమైన సమస్యలనుకూడ పరిష్కరించడం అంతకు కాస్త చిన్నలెక్కల్లోనూ ఉదాహరణలుగా ఏంగెల్సు వివరిస్తాడు ].

| | | |
|---|---|---|
| యంత్రగతి శాస్త్రంలో | : | క్రియ, ప్రతిక్రియ (చర్య, ప్రతిచర్య **action and reaction**). |
| భౌతిక శాస్త్రంలో | : | ధన విద్యుత్తు; రుణ విద్యుత్తు (**positive and negative electricity**). |
| రసాయన శాస్త్రంలో | : | పరమాణువుల సంయోగం, వియోగం. |
| సామాజిక శాస్త్రంలో | : | వర్గ పోరాటం. [9] |

యుద్ధంలో దాడి, రక్షణ; ముందంజ, వెనుకంజ; గెలుపు, ఓటమి - ఇవన్నీ పరస్పరం విరుద్ధమైన పరిణామాలు. ఒకటి లేకుండా మరొకటి మనివుండ లేదు. ఈ రెండు అంశాలూ ఏకకాలంలో పరస్పరం ఘర్షిస్తూ, పరస్పరం ఆధారపడుకుంటూ వుంటాయి. ఇదే యుద్ధ సంపూర్ణతను రూపొందిస్తూ, దాని అభివృద్ధిని ముందుకు తోస్తూ, దాని సమస్యల్ని పరిష్కరిస్తూ వుంటుంది.

మనిషి భావనల్లో వచ్చే ప్రతి విభేదమూ ఒక భౌతిక వైరుధ్యాన్ని ప్రతిబింబిస్తుందని గుర్తెరగాలి. భౌతిక(వస్తుగత – objective) వైరుధ్యాలు స్వీయమానసిక (కర్తృపర – subjective) ఆలోచనలో ప్రతిఫలిస్తాయి; ఈ ప్రక్రియ భావనల పరస్పర విరుద్ధ చలనానికి రూపుదిద్దుతుంది, ఆలోచనల వికాసక్రమాన్ని ముందుకు తోసుకువెళ్ళుతూ, మనిషి ఆలోచనాక్రమంలో తలయెత్తే సమస్యల్ని నిర్విరామంగా పరిష్కరిస్తూ పోతుంది.

పార్టీలోకూడ విభిన్న రకాల అభిప్రాయాలనడుమ నిరంతరాయంగా వ్యతిరేకత, పోరాటాలు సంభవిస్తుంటాయి. ఇది సమాజంలోని వివిధ వర్గాల మధ్య, పాత, కొత్తల నడుమ గల వైరుధ్యాలు పార్టీలోపల ప్రతిబింబించడమే నని గ్రహించాలి. పార్టీలో వైరుధ్యాలు, వాటిని పరిష్కరించేందుకు సైద్ధాంతిక పోరాటాలు గనుక లేకపోతే యిక పార్టీ జీవితమే అంతరించిపోతుంది.

---

[9] వి.ఐ. లెనిన్, "*గతితర్కం సమస్యపై*" (1915), సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పు. 357.

కనుక వైరుధ్యం సార్వత్రికంగానూ, అవి సామాన్య చలన రూపాలేగాని లేక సంక్లిష్ట చలన రూపాలేగాని, అవి భౌతిక పరిణామాలేగాని లేక భావజాలపర పరిణామాలేగాని సమస్త క్రమాల్లోనూ మనివుంటుందనేది యిప్పటికే స్పష్టమై పోయింది గదా. అయితే ఈ వైరుధ్యం, ప్రతి క్రమపు ఆరంభ(తొలి) దశలో కూడ వుంటుందా ? ప్రతి విడి వస్తువు లేక పరిణామపు అభివృద్ధి క్రమంలోనూ మొదలునుండి తుదిదాకా విరుద్ధాంశాల చలనమనేది వుంటుందా ?

ఒక క్రమం ఆదినుండీ కాక అది ఒక నిశ్చిత దశకు అభివృద్ధి చెంది వున్నప్పుడే వైరుధ్యం సాక్షాత్కరిస్తుందని డెబోరిన్ తత్వకూటమి అభిప్రాయ పడుతున్నట్లు వారిని విమర్శించే సోవియట్ తత్వవేత్తలు రాసిన వ్యాసాలనుబట్టి తెలుస్తున్నది. ఇది యథార్థమే అయితే అప్పుడు ఆ దశ రాకమునుపు ఆ క్రమం చెందిన అభివృద్ధికి కారణం అంతర్గతమైనదికాక బాహ్యమైనదయి వుండాలి. ఈ విధంగా డెబోరిన్ బాహ్య కారణవాదం, యాంత్రికత్వాలనే అధిభౌతిక సిద్ధాంతాలకే తిరిగి వెళ్లుతున్నట్లవుతూంది. ఈ దృక్పథాన్ని నిర్దిష్ట సమస్యల విశ్లేషణకు అన్వయించినప్పుడు డెబోరిన్ కూటమి సోవియట్ యూనియన్‌లో సాధారణంగా యిప్పుడున్న పరిస్థితుల్లో రైతులు, కులక్కుల (ధనిక రైతుల) మధ్య వ్యత్యాసాలనేతప్ప వైరుధ్యాలను గమనించలేక పోతున్నారు; తద్వారా వారు బుఖారిన్‌తో సంపూర్ణంగా ఏకీభవిస్తున్నారు.[10]

---

10 బుఖారిన్ (1888-1938) రష్యన్ విప్లవోద్యమంలో ఒక లెనినిస్టు వ్యతిరేక ముఠాకు నాయకత్వం వహించాడు. అనంతరం అతడు ఒక విప్లవ విద్రోహుల బృందంలో చేరాడు; 1937లో పార్టీనుండి బహిష్కరించబడ్డాడు. 1938లో సోవియట్ సుప్రీం కోర్టు అతనికి మరణశిక్ష విధించింది. ఇక్కడ కామ్రేడ్ మావో సే టుంగ్ బుఖారిన్ చిరకాలంగా వాదిస్తూవస్తున్న వర్గ వైరుధ్యాలను మరుగుపర్చేసి, వర్గ పోరాటాల స్థానే వర్గ లాలూచీని తెచ్చిపెట్టే తప్పుడు దృక్పథాన్ని విమర్శిస్తున్నాడు. 1928-29 కాలంలో సోవియట్ యూనియన్ వ్యవసాయంలో సర్వతోముఖ సమష్టీకరణకు సిద్ధపడుతున్నప్పుడు, బుఖారిన్ ఒకవైపు ధనిక రైతులకు, మరొకవైపు చిన్న, మధ్య రైతులకు నడుమగల వర్గవైరుధ్యాన్ని కప్పిపుచ్చేందుకు, ధనిక రైతులకు వ్యతిరేకంగా దృఢదీక్షతో పోరాటం చేయడాన్ని ప్రతిఘటించేందుకు ప్రయత్నించేస్తూ, తన తప్పుడు భావాలను మరింత మరింతగా నొక్కివక్కాణించసాగాడు. కార్మిక వర్గం ధనిక రైతులతో పొత్తు పెట్టుకోవచ్చునీ, వాళ్లు (ధనిక రైతులు) "శాంతియుతంగానే సోషలిజంలోనికి ఎదుగుతారు, " అనీ ఒక తప్పుడు అంచనానుకూడ బుఖారిన్ ప్రచారం చేయసాగాడు.

[ నికొలాయ్ ఇవనోవిచ్ బుఖారిన్ : 1888 అక్టోబరు 9వతేదీన మాస్కోలో జన్మించాడు. అర్థశాస్త్ర విద్యార్థిగా వుండగానే విప్లవోద్యమంలోకి ప్రవేశించిన బుఖారిన్ 1906 లో

రష్యన్ సోషల్ డెమొక్రటిక్ వర్కర్స్ పార్టీలో చేరి, 1908లో మాస్కో బోల్షివిక్కు కమిటీ సభ్యుడయ్యాడు. 1911 లో జారిస్టు పోలీసులచే అరెస్టుచేయబడి, ప్రవాసశిక్షకు గురై తెల్లసముద్రం సమీపంలోని ఒనేగాకు పంపబడ్డాడు. కాని అనతికాలంలో తప్పించుకుని, పశ్చిమ యూరపుకు పారిపోయాడు. 1912లో లెనిన్‌ను క్రాకౌ పట్టణంలో కలుసుకున్నాడు. ఆయనతోబాటు పార్టీపత్రిక ప్రావ్దా (సత్యం) లో పనిచేసాడు. 1916లో న్యూయార్కు వెళ్లి, అక్కడ నొవీ మీర్ (నవ ప్రపంచం) అనే లెనినిస్టు పత్రికకు సంపాదకునిగా పని చేసాడు. 1917 ఫిబ్రవరి విప్లవం దరిమిలా రష్యాకు తిరిగివచ్చి, పార్టీలో చురుగ్గా పని చేయసాగాడు. 1917 ఆగస్టులో బోల్షివిక్కు కేంద్ర కమిటీ సభ్యుడయ్యాడు. రాజ్యాధికారం బోల్షివిక్కుల హస్తగతం అయిన తర్వాత పార్టీ పత్రిక ప్రావ్దా కు సంపాదకునిగా బాధ్యతలు నిర్వహించసాగాడు. అయితే జర్మనీతో బ్రెస్ట్-లిటోవ్స్క్ సంధి కుదుర్చుకునే విషయమై లెనిన్‌తో తీవ్రంగా విభేదించి, ప్రావ్దా సంపాదక పదవికి రాజీనామా చేసి, పార్టీలో వామపక్ష కమ్యూనిస్టుల బృందం అనే ప్రతిపక్షం ఒకటి ఏర్పాటుచేసి, సంధి కుదుర్చుకుని ప్రపంచ యుద్ధంనుండి విరమించుకోవడం సరికాదనీ, దానికి బదులు యుద్ధాన్ని ఐరోపా అంతటా ఒక సార్వత్రిక కమ్యూనిస్టు విప్లవంగా మార్చే కృషికి పూనుకోవాలని వాదనలు, ప్రచారం చేయసాగాడు. తర్వాత 1919 మార్చిలో అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ (కొమింటర్న్) కార్యనిర్వాహక కమిటీ సభ్యుడయ్యాడు. తర్వాతి 3-4 ఏళ్ల కాలంలో అనేక ముఖ్యమైన సైద్ధాంతిక, ఆర్థిక రచనలు చేసి, ప్రచురించాడు. పరివర్తనాకాలంలో ఆర్థికవిధానం ( *Economics of the Transitional Period*, 1920), కమ్యూనిజం మూలసూత్రాలు ( యుజినీ ప్రియొబ్రెజెన్స్కీతో కలిసి, 1921), చారిత్రక భౌతికవాద సిద్ధాంతం (1921) లు వాటిలో ముఖ్యమైన పుస్తకాలు. లెనిన్ మరణానంతరం బుఖారిన్ పార్టీ పొలిట్ బ్యూరోలో పూర్తిస్థాయి సభ్యుడయ్యాడు. లెనిన్ ప్రతిపాదించి, ప్రవేశపెట్టిన **నూతన ఆర్థిక విధానం** (New Economic Policy) ప్రధాన మద్దతుదారుగా వుంటూవచ్చాడు. తొందరపడి ఉధృతమైన పారిశ్రామికీకరణను, వ్యవసాయంలో సమష్టీకరణను ప్రారంభించకుండా, మెల్లమెల్లగా ఆర్థిక మార్పు తీసుకురావాలనేది ఆ NEP సారాంశం. బుఖారిన్ దీన్ని తుదికంటా నొక్కిచెప్పుతూ వచ్చాడు. ఆ క్రమంలో ఉధృత పారిశ్రామికీకరణను, వ్యవసాయంలో సమష్టీకరణను గట్టిగా కోరుతూండిన ట్రాట్స్కీ, జినొవీవ్, కామెనేవ్‌లను వ్యతిరేకిస్తూ కొంతకాలం స్టాలిన్‌తో పొత్తుపెట్టుకున్నాడు. 1926 లో జినొవీవ్ స్థానంలో కొమింటర్న్ అధ్యక్షుడయ్యాడు. అయితే ట్రాట్స్కీ, జినొవీవ్, కామెనేవ్‌లను ఓడించిన పిదప అచిరకాలంలో (1928లో) స్టాలిన్ తన విధానం మార్చుకుని, మళ్లీ ట్రాట్స్కీ ప్రభృతులు చెప్పిన ఉధృత పారిశ్రామికీకరణ, వ్యవసాయంలో సమష్టీకరణ పంథానే అమలుచేయబూనుకోవడంతో బుఖారిన్ దాన్ని తీవ్రంగా ప్రతిఘటించి, స్టాలిన్ ఆగ్రహానికి గురయ్యాడు. పర్యవసానంగా 1929 ఏప్రిల్‌లో తన కొమింటర్న్ అధ్యక్షస్థానాన్ని కోల్పోయాడు. ఆనక 1929 నవంబరులో పొలిట్ బ్యూరోనుండి బహిష్కరించబడ్డాడు. అయితే ఈ వత్తిళ్లకు తట్టుకోలేక బుఖారిన్ అయిష్టంగానేనైనా క్షమాపణలు చెప్పుకుని, 'ఆత్మ విమర్శ' చేసుకోవడంతో స్టాలిన్ అతడ్ని పార్టీనాయకత్వంలోకి తిరిగి తీసుకుని, 1934లో సోవియట్ ప్రభుత్వ అధికారిక పత్రిక ఇజ్వెస్తియా కు సంపాదకునిగా నియమించాడు. 1936 సోవియట్ రాజ్యాంగ రచనలోకూడ బుఖారిన్ పాల్గొన్నాడు. అయితే పూర్వవైభవం, పేరుప్రతిష్టలు మాత్రం యిక పొందలేకపోయాడు. పైగా 1937 జనవరిలో రహస్యంగా నిర్బంధించబడ్డాడు; ట్రాట్స్కీయిస్టు అని ముద్రవేసి అతడ్ని పార్టీనుండి బహిష్కరించారు. తర్వాత 1938 మార్చిలో చిట్టచివరి బాహాట ప్రక్షాళనా విచారణ

ఫ్రెంచి విప్లవాన్ని విశ్లేషించేటప్పుడు ఈ కూటమి, అక్కడకూడ విప్లవానికి పూర్వం మూడో ఎస్టేట్‌లో వ్యత్యాసాలు, విభేదాలే తప్ప దానిలోని కార్మికులు, రైతులు, బూర్జువాల మధ్య వైరుధ్యాలైతే వుండేవి కావని వాదిస్తారు. డెబోరిన్ కూటమి వెలిబుచ్చే యీ అభిప్రాయాలు మార్క్సిస్టు వ్యతిరేకమైనవి. ప్రతి ఒక్క తేడా, ప్రతి ఒక్క విభేదంలో అప్పటికే ఒక వైరుధ్యం వుండివుంటుందని, విభేదమంటేనే వైరుధ్యమని ఈ కూటమి అర్థం చేసుకోలేకపోతున్నారు. పుట్టిన దాదిగా పెట్టుబడిదారులు, కార్మికులు పరస్పరం తలపడుతూనేవున్నారు; కాకుంటే ఈ రెండు వర్గాల నడుమ వైరుధ్యం మొదట్లో అంతగా తీవ్రతరమై వుండలేదంతే. ఇప్పుడు సోవియట్ యూనియన్‌లోవున్న సాంఘిక పరిస్థితుల్లోనైనా కార్మికులు, రైతుల మధ్య విభేదం వుండనేవుంది. మరి యీ విభేదమే ఒక వైరుధ్యం. అయితే కార్మికులు, పెట్టుబడిదారులకు నడుమ వైరుధ్యంలా అది ఒక శత్రుస్వభావాన్ని సంతరించుకుని, వర్గపోరాట రూపం ధరించకపోవచ్చుగాని, కావడానికైతే అది ఒక వైరుధ్యమేనని గ్రహించాలి.

---

(public purge trial) లో విప్లవవిద్రోహి, దేశద్రోహి, గూఢచారి వగైరా నిందాభియోగాలకు గురై, విచిత్రమైన, అతి అవమానకర పద్ధతుల్లో 'ఒప్పుదల' సమర్పించుకుని, ఆ ప్రాతిపదికన మరణ శిక్షకు గురై, ప్రాణాలు కోల్పోయాడు. స్టాలిన్ మరణానంతరం సోవియట్ యూనియన్‌లో ప్రజాస్వామిక, సరళీకరణా మార్పులు సంభవించినా బుఖారిన్ తదితర ప్రముఖ నాయకుల పాత్రగురించి పునఃపరిశీలన, అధికారిక వైఖరి మార్పుమాత్రం చాల ఆలస్యమయింది. ఎట్టకేలకు 1988 లో బుఖారిన్‌కు మరణానంతర పునరావాసం లభించింది. దేశద్రోహి, విప్లవవిద్రోహి అనే నిందలు ఉపసంహరించుకుంటూ, ఒప్పుకోదగ్గ కమ్యూనిస్టుగా అధికారిక గుర్తింపు నిచ్చారు.

పోతే, బుఖారిన్ విషయంలో మావో అభిప్రాయాలనుగాని, డెబోరిన్‌ను చదవకుండానే ఆయన్ను విమర్శించే రచనల ఆధారంగా తానూ విమర్శకు సాహసించడాన్ని గాని మేము హర్షించడం లేదని స్పష్టం చేయదల్చుకున్నాము. ఒక వ్యక్తి చెప్పేది సొంతం వినకుండానే అతడ్ని భూస్థాపితం చేసివేసే అవాంఛనీయ, అప్రజాస్వామిక ధోరణులు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో కోకొల్లలై, దాని వినాశానికి దారితీస్తున్నాయని మేము వ్యథ చెందుతున్నాము. స్టాలినిస్టు అత్యాచారాలకు బలైపోయిన, లెనిన్‌కు అనుంగు మిత్రుడు, శిష్యుడైన బుఖారిన్‌గురించి, ఉద్వాసనకు, అవమానాలకు గురైన డెబోరిన్‌గురించి మనం పునరాలోచించవల్సిన అవసరం ఎంతైనా వుంది. అలాగే డెబోరిన్ చెప్పినదాని సారాంశం అనంతరకాలంలో మావోయే నొక్కిచెప్పిన శత్రుపూరితంకాని (non-antagonistic) వైరుధ్యాలు, ప్రజలమధ్య వైరుధ్యాలు అనే కోవలకు చెందుతుందేమో పరిశీలించవల్సిన అవసరంకూడ లేకపోలేదు. ఏమైనా ఒకరు చెప్పింది చదవకుండానే వారిపై విమర్శనాస్త్రాలు సంధించే దురాచారానికి మావోకూడ తలపడడం శోచనీయ మన్నంతవరకే యిక్కడ వ్యాఖ్యానించదల్చుకున్నాము - అను.]

సోషలిస్టు నిర్మాణక్రమంలో కార్మికులు, రైతులు ఒక దృఢమైన పొత్తు పెట్టుకుని, సోషలిజంనుండి కమ్యూనిజానికి ముందంజవేసే క్రమంలో ఈ వైరుధ్యాన్ని మెల్లమెల్లగా పరిష్కరించుకుంటున్నారు. కనుక సమస్యంతా విభిన్న రకాలైన వైరుధ్యాలకు సంబంధించిందేగాని, అసలుకు వైరుధ్యమే వున్నదా, లేదా అనైతే కాదు. వైరుధ్యం విశ్వజనీనం, అఖండం; సకల వస్తువుల అభివృద్ధి క్రమంలోనూ అది ఉనికిలో వుంటుంది; ప్రతి క్రమంలోనూ ఆదినుండి అంతందాకా 'వ్యాపించి వుంటుంది.

ఒక కొత్త క్రమం ఆవిర్భవించడ మంటే అర్థం ఏమిటి? దానిలోవుండే విరుద్ధాంశాలతో కూడుకునివుండే పాత ఏకత (unity) అంతరించి వేరే విరుద్ధాంశాలతో కూడుకునివుండే యింకో కొత్త ఏకత ఆ స్థానాన్ని తీసుకుంటుంది. దానితో పాతక్రమం స్థానే ఒక కొత్తక్రమం ఆవిర్భవిస్తుంది. పాత క్రమం సమాప్తమై, కొత్త క్రమం ఆరంభమవుతుంది. మరి ఈ నూతన క్రమం నూతన వైరుధ్యాలను కలిగివుంటుంది; అది దాని సొంత వైరుధ్యాల అభివృద్ధి చరిత్రను ప్రారంభిస్తుందన్న మాట.

లెనిన్ మన దృష్టికి తీసుకువచ్చినట్లు, వస్తువుల అభివృద్ధిక్రమంలో ఆదినుండి తుదిదాకా సాగుతుండే ఈ విరుద్ధాంశాల చలనంగురించిన ఒక నమూనా విశ్లేషణ మార్క్స్ తన **పెట్టుబడి** (Capital) గ్రంథంలో సమర్పించివుండడం గమనిస్తాము. సమస్త వస్తువుల వికాసాన్ని అధ్యయనం చేసేటప్పుడూ మనం విధిగా అవలంబించాల్సిన పద్ధతి యిది. లెనిన్‌కూడ ఈ పద్ధతిని సవ్యంగా అవలంబించాడు; తన రచనలన్నిటిలోనూ ఈ పద్ధతికే కట్టుబడ్డాడు. లెనిన్ యిలా అంటాడు :

**తన పెట్టుబడి (Capital) గ్రంథంలో మార్క్స్ మొదటగా బూర్జువా(సరుకుల - Commodity) సమాజంలోని అత్యంత సులభసరళమైన, అత్యంత సాధారణం, మౌలికం, అత్యంత సామాన్యం అయిన, అనుదినమూ ఎదురయ్యే సంబంధాన్ని , కోట్లాది సార్లుగా తటస్థపడుతూండే సంబంధాన్ని - అంటే సరుకుల మార్పిడీని విశ్లేషిస్తాడు. ఈ విశ్లేషణ యీ సులభసామాన్య పరిణామంలోనే ( బూర్జువా సమాజపు ఈ కణం లో) ఆధునిక సమాజపు వైరుధ్యాలు అన్నింటినీ (లేక ఈ వైరుధ్యాలు అన్నింటి బీజాలను) వెల్లడి గావిస్తుంది. ఆ తర్వాతి వివరణ మనకు ఈ వైరుధ్యాలయొక్క, దాని విడివిడి భాగాలన్నింటి Σ (కూడిక)గా ఈ సమాజంయొక్క అభివృద్ధిని ( పెరుగుదలనూ మరియు చలనాన్ని రెంటినీ ), ఆదినుండి తుదిదాకా, ప్రదర్శించి చూపుతుంది.**

లెనిన్ యింకా యిలా చేర్చి చెప్పుతాడు :

**సాధారణంగా గతితర్కపు వివరణకు (లేక అధ్యయనానికి) సంబంధించిన పద్ధతికూడ యిలాగే వుండాలి.** [11]

చైనా కమ్యూనిస్టులు ఈ పద్ధతిని నేర్చుకోవాలి. అప్పుడుమాత్రమే వాళ్లు చైనా విప్లవ చరిత్రను, దాని ప్రస్తుత స్థితిగతుల్ని సరిగ్గా విశ్లేషించగలుగుతారు; దాని భవిష్యత్తును అంచనా వేసుకోగల్గుతారు.

## 3. వైరుధ్యం ప్రత్యేకత
## ( The Particularity of Contradiction )

సకల వస్తువుల అభివృద్ధి క్రమంలోనూ వైరుధ్యం ఉనికిలో వుంటుంది. ప్రతి వస్తువు అభివృద్ధి క్రమంలోనూ అది ( వైరుధ్యం) ఆదినుండి అంతందాకా వ్యాపించివుంటుంది. మనం పైన చర్చించిన వైరుధ్యపు విశ్వజనీనత, అఖండత యిదే. మరి మనమిప్పుడు వైరుధ్యపు ప్రత్యేకత మరియు సాపేక్షతలనుగురించి చర్చిద్దాం.

ఈ సమస్యను మనం అనేక స్థాయిల్లో, పలు కోణాలనుండి అధ్యయనం చేయాల్సివుంటుంది.

మొదటగా, ప్రతి పదార్థచలన రూపంలోనూ వైరుధ్యం దాని సొంత ప్రత్యేకత కలిగివుంటుంది. చలనంలోని పదార్థం తప్ప ఈ ప్రపంచంలో మరేదీ లేదు గనుక, ఈ చలనం ఏవైనా నిశ్చిత రూపాలు ధరించక తప్పనిసరి గనుక, పదార్థంగురించి మనిషి కుండే జ్ఞానం దాని(పదార్థపు) చలనరూపాలనుగురించిన జ్ఞానమేనని తెలుసుకోవాలి. ఏ పదార్థచలన రూపాన్నిగురించి యోచించేటప్పుడైనా మనం దానికి యితర చలనరూపాలతో సామాన్యంగావున్న అంశాలేమిటో గమనించాలి. అయితే, అంతకంటెకూడ, ఒక వస్తువు గురించిన మన జ్ఞానానికి పునాదిగా వుండడం మూలంగా,ఎంతో

---

[11] వి.ఐ. లెనిన్, " *గతితర్కం సమస్యపై* " (1915), సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పుటలు 358 -359.

ముఖ్యమైనదీ, ప్రత్యేకించి అవసరమైనదీ ఏమిటంటే మనం పరిశీలించే పదార్థచలన రూపానికే ప్రత్యేకమైనదేమిటో, అంటే ఈ చలనరూపానికీ, యితర చలనరూపాలకూ మధ్యగల గుణాత్మక అంతరాలు (విభేదాలు) ఏమిటో గమనించడమే. అలా చేసినప్పుడే మనం వస్తువులను వేరుచేసి చూడగల్గుతాం. ప్రతి చలనరూపమూ దానిలో అది ఒక స్వీయ, ప్రత్యేక వైరుధ్యాన్ని కలిగివుంటుంది. ఈ ప్రత్యేక వైరుధ్యమే ఒక వస్తువును మరొక వస్తువునుండి వేరుచేసి చూపే ప్రత్యేక సారాంశాన్ని ఏర్పరుస్తుంది. ఈ ప్రపంచంలోని వస్తుజాలంలో గల అపారమైన వైవిధ్యతకు అంతర్గత కారణం, లేక ప్రాతిపదిక అనికూడ అనవచ్చు, యిదే. ప్రకృతిలో అనేక చలనరూపాలు - యాంత్రిక చలనం, ధ్వని, కాంతి, వేడిమి, విద్యుత్తు, వియోగము, సంయోగము, యిలా యిలా అనేకం వున్నాయి. ఈ రూపాలన్నీ పరస్పరాధారితాలే కాని, దాని సారాంశంలో అదిగా ప్రతిదీ యితర రూపాలకు భిన్నంగా వుంటుంది. ప్రతి చలనరూపపు ప్రత్యేక సారాంశమూ దాని సొంత ప్రత్యేక వైరుధ్యంచే నిశ్చయింపబడుతుంది. ఇది ప్రకృతి విషయంలోనేగాక, సాంఘిక, భావజాలపర(సైద్ధాంతిక) పరిణామాలకుకూడ, సత్యమై వర్తిస్తుంది. ప్రతి సమాజరూపమూ, ప్రతి రకమైన భావజాలమూ దాని సొంత ప్రత్యేక వైరుధ్యాన్ని, ప్రత్యేక సారాంశాన్ని కలిగివుంటుంది.

సరిగ్గా, తమ తమ అధ్యయన లక్ష్యాలలో అంతర్నిహితమై వుండే ప్రత్యేక వైరుధ్యాల ప్రాతిపదికపైనే వివిధ విజ్ఞానశాస్త్రాలన్నీ వేరుచేసి చూడ బడతాయి. ఈ విధంగా ఒక నిశ్చిత వస్తుపరిణామ రంగానికి విశేషమైవుండే వైరుధ్యం ఒక ప్రత్యేక విజ్ఞానశాస్త్రశాఖకు అధ్యయన విషయంగా వుంటుంది. ఉదాహరణకు, గణితంలో ధన సంఖ్యలు - రుణ సంఖ్యలు; యంత్రగతి శాస్త్రం (mechanics)లో చర్య - ప్రతిచర్యలు; భౌతిక శాస్త్రంలో ధన విద్యుత్తు-రుణ విద్యుత్తులు; సమాజ శాస్త్రంలో ఉత్పత్తి శక్తులు - ఉత్పత్తి సంబంధాలు, వర్గాలు - వర్గ పోరాటం; యుద్ధ విజ్ఞానశాస్త్రంలో దాడి - రక్షణలు; తత్వశాస్త్రంలో భావవాదం - భౌతికవాదం, అధిభౌతిక దృక్పథం - గతితార్కిక దృక్పథం; యిలా యిలా ఎన్నో. సరిగ్గా ప్రతి విజ్ఞానశాస్త్ర శాఖా దాని సొంత ప్రత్యేక వైరుధ్యం, ప్రత్యేక సారాంశం కలిగివుండడం చేత యివన్నీకూడ వివిధ శాస్త్రశాఖల అధ్యయన విషయాలుగా వున్నాయని గ్రహించాలి. పోతే, వైరుధ్యం విశ్వజనీనతను మనం అర్థం చేసుకొనేంతదాకా

వస్తువుల చలనం లేక అభివృద్ధికి సార్వత్రిక కారణం లేక సార్వత్రిక ప్రాతిపదిక ఏమిటో తెలుసుకునే మార్గం మనకుండదనేది నిజమే ననుకోండి. అయితే వైరుధ్యపు ప్రత్యేకతను మనం అధ్యయనం చేయనిదే - ఒక వస్తువును యితర వస్తువులనుండి వేరుచేసి చూపే ప్రత్యేక సారాంశం ఏమిటో నిశ్చయించే మార్గమేదీ మనకుండదు కూడ. అలా (వైరుధ్య ప్రత్యేకతను) అధ్యయనం చేస్తేతప్ప ఒక వస్తువు చలనం లేక అభివృద్ధికి ప్రత్యేక కారణం లేక ప్రత్యేక ప్రాతిపదిక ఏమిటో కనుగొనే మార్గం, వివిధ విజ్ఞానశాస్త్ర రంగాలను గిరిగీసి చూసే, ఒక వస్తువునుండి మరొక వస్తువును వేరుచేసి చూచే మార్గంకూడ మనకేదీ వుండదు.

మానవ జ్ఞానచలన గతిశ్రేణికి సంబంధించినంతవరకు, విడి విడి ప్రత్యేక వస్తువుల జ్ఞానంనుండి సాధారణంగా వస్తువులనుగురించిన జ్ఞానానికి క్రమవికాసం సదా జరుగుతూంటుంది. అనేక విభిన్న వస్తువుల ప్రత్యేక సారాంశంగురించి తెలుసుకున్నప్పుడే మనిషి సాధారణీకరణకు ఉపక్రమించి, వస్తువుల్లోని సామాన్య సారాంశాన్ని తెలుసుకోగల్గుతాడు. ఈ సామాన్య సారాంశంగురించి జ్ఞానం సంతరించుకున్నాక మనిషి యింకా ముందుకు పోయి, అంతదాకా అధ్యయనం చేయని, లేక సమగ్రంగా అధ్యయనం చేయని, నిర్దిష్ట వస్తువులు లేక విషయాలను అధ్యయనం చేసి, వాటి ప్రతిదానియొక్క ప్రత్యేక సారాంశాన్ని కనుగొనడానికి దాన్ని (సామాన్య సారాంశ జ్ఞానాన్ని) ఒక మార్గదర్శిగా ఉపయోగిస్తాడు. ఈ విధంగా మాత్రమే ఆ వస్తువులు లేక విషయాల సామాన్య సారాంశంగురించి తనకు సమకూడిన జ్ఞానాన్ని వడలిపోకుండా, గడ్డకట్టి పోకుండా నివారించుకోగల్గుతాడు; దాన్ని ఇతోధికం, సుసంపన్నం, వికసితం చేసుకోగల్గుతాడు. ఇక్కడ రెండు జ్ఞానార్జనా క్రమాలున్నాయి : ప్రత్యేక అంశాలనుండి సాధారణ అంశాలకు సాగేదొకటి; సాధారణ అంశంనుండి ప్రత్యేక అంశాలకు దొర్లేది మరొకటి. ఈ విధంగా జ్ఞానార్జన ఎల్లప్పుడూ వలయాల పుంతలో సాగిపోతూంటుంది; మరి (ఖచ్చితంగా శాస్త్రీయ పద్ధతికి అంటిపెట్టుకొనివుండేంతదాకా) యిలాంటి ప్రతి వలయమూ మానవ జ్ఞానాన్ని మరో మెట్టు పైకి తీసుకువెళ్లుతూ, దాన్ని మరింత మరింత ప్రగాఢంగా రూపొందిస్తూవుంటుంది. ఈ సమస్యపై మన పిడివాదులు తప్పటడుగులు వేసే దెక్కడంటే, ఒక వైపున, ఏదైనా వైరుధ్యం విశ్వజనీనతనుగురించి, వస్తువుల సామాన్య సారాంశాన్ని గురించి తగినంతగా

తెలుసుకోవాలంటే మనం ముందుగా వైరుధ్యం ప్రత్యేకతను అధ్యయనం చేయాల్సివుంటుంది, విడి విడి వస్తువులు, విషయాల ప్రత్యేక సారాంశాన్ని గ్రహించాల్సివుంటుందని అర్థం చేసుకోలేకపోతారు; మరోవైపున, ఈ వస్తువుల సామాన్య సారాంశాన్ని గ్రహించిన పిదప మనం అంతటితో ఆగక, యింకా ముందుకు సాగి అంతదాకా కూలంకషంగా అధ్యయనం చేయబడని, లేక అప్పుడప్పుడే ఆవిర్భవించిన నిర్దిష్ట వస్తువులు, విషయాలనుగురించి అధ్యయనం చేయాలనికూడ వాళ్లు అర్థం చేసుకోలేకపోతారు. మన పిడివాదులు బహుసోమరిపోతులు లెండి. నిర్దిష్ట వస్తువులనుగురించి ఓపిగ్గా, కష్టపడి అధ్యయనం చేయబూనుకోరు. సాధారణ సత్యాలు ఏదో శూన్యంనుండి పుట్టుకువచ్చేట్లు భావిస్తారు. ఆ సాధారణ సత్యాలను శుద్ధ అనిర్దిష్టమైన, ఏమాత్రం కొరుకుడుపడని ఫార్ములాలుగా మార్చివేస్తారు. తద్వారా మనిషి మామూలుగా సత్యాన్ని గ్రహించే వరసనే పూర్తిగా నిరాకరిస్తూ, తల్లక్రిందులు చేసేస్తూంటారు. పోతే ఈ పిడివాదులు జ్ఞానార్జనకు సంబంధించిన రెండు క్రమాలమధ్యగల పరస్పరసంబంధాన్ని – ప్రత్యేకాంశాలనుండి సాధారణతకు, తదనంతరం సాధారణతనుండి ప్రత్యేకాంశాలకుగా సాగే క్రమాల పరస్పర సంబంధాన్ని సైతం అర్థం చేసుకోరు. మార్క్సిస్టు జ్ఞాన సిద్ధాంతాన్ని వాళ్లు బొత్తిగా అర్థంచేసుకోరు.

ద్రవ్యచలనరూపాలకుచెందిన ప్రతి మహావ్యవస్థ యొక్క ప్రత్యేక వైరుధ్యాన్ని అధ్యయనంచేసి, తద్వారా దాని సారాంశాన్ని నిశ్చయపర్చుకోవడమేగాక, ప్రతి పదార్థచలనరూపపు సుదీర్ఘ అభివృద్ధిక్రమంలో ఆ ప్రతి క్రమపు సారాంశాన్ని అధ్యయనంచేసి తెలుసుకోవల్సిన అవసరంకూడ వుంది. ప్రతి చలనరూపంలోనూ వాస్తవికమైన (ఊహాకల్పితంకాని) ప్రతి అభివృద్ధిక్రమమూ [యితర క్రమాలకు ] గుణాత్మకంగా విభిన్నమైవుంటుంది. మన అధ్యయనం ఈ అంశాన్ని నొక్కిచెప్పుతూ, అక్కడినుండే ప్రారంభంకావల్సివుంటుంది.

గుణాత్మకంగా భిన్నమైన వైరుధ్యాలు గుణాత్మకంగా భిన్నమైన పద్ధతుల్లోనే పరిష్కరించబడగల్గుతాయి. ఉదాహరణకు, కార్మికవర్గానికీ, బూర్జువావర్గానికీ నడుమ గల వైరుధ్యం సోషలిస్టు విప్లవ పద్ధతిద్వారా పరిష్కారమవుతుంది. ఫ్యూడల్ వ్యవస్థకూ, అశేష ప్రజానీకానికీ మధ్యగల వైరుధ్యం ప్రజాస్వామిక విప్లవం ద్వారా పరిష్కరింపబడుతుంది.

సామ్రాజ్యవాదానికీ, వలసదేశాలకూ నడుమ వైరుధ్యం జాతీయ విప్లవ యుద్ధంద్వారా పరిష్కరింపబడుతుంది. సోషలిస్టు సమాజంలో కార్మిక వర్గానికీ, రైతాంగానికీ మధ్యవుండే వైరుధ్యం వ్యవసాయాన్ని సమష్టీకరణం, యాంత్రీకరణాలు చేయడంద్వారా పరిష్కారమౌతుంది. కమ్యూనిస్టు పార్టీలోపలే వుండే వైరుధ్యం విమర్శ-ఆత్మవిమర్శల క్రమంద్వారా పరిష్కరింప బడుతుంది. సమాజానికీ, ప్రకృతికీ నడుమగల వైరుధ్యం ఉత్పత్తి శక్తుల్ని అభివృద్ధిగావించే పద్ధతిద్వారా పరిష్కారమవుతుంది. క్రమాలు మారుతుంటాయి, పాత క్రమాలు, పాత వైరుధ్యాలు అదృశ్యమై, కొత్త క్రమాలు, కొత్త వైరుధ్యాలు ఆవిర్భవిస్తుంటాయి. తదనుగుణంగానే వైరుధ్యాలను పరిష్కరించే పద్ధతులుకూడ మారుతుంటాయి. రష్యాలో ఫిబ్రవరి విప్లవం పరిష్కరించిన వైరుధ్యానికీ, అక్టోబరు విప్లవం పరిష్కరించిన వైరుధ్యానికీ మధ్య మౌలిక తేడా వుంది. అలాగే వాటి రెంటి పరిష్కారానికీ ఉపయోగించిన పద్ధతుల్లోకూడ ప్రాథమిక విభేదం వుంది. విభిన్న వైరుధ్యాలను పరిష్కరించడానికి విభిన్న పద్ధతులు ఉపయోగించే సూత్రాన్ని మార్క్సిస్టు-లెనినిస్టులు ఖచ్చితంగా పాటించాలి. పిడివాదులు ఈ సూత్రాన్ని పాటించరు. విభిన్న రకాల విప్లవాల్లో పరిస్థితులు విభిన్నంగా వుంటాయని వాళ్లు అర్థం చేసుకోరు; కనుక విభిన్న వైరుధ్యాల పరిష్కారానికి విభిన్న పద్ధతులు ఉపయోగించాల్సి వస్తుందనీ వారికి అర్థం కాదు. కాకపోగా వాళ్లెపుడూ తిరుగులేని మంత్రంగా (చెక్కుచెదరని ఫార్ములాగా) తామూహించుకునే పద్ధతినే అవలంబిస్తూ, ప్రతిచోటా దాన్నే యిచ్చవచ్చినట్లు ప్రయోగిస్తూంటారు. దీనివల్ల విప్లవం పెడురుదెబ్బలు తినడమో లేదా చక్కగా సాధించగల్గినదాన్ని ఒక రసాభాస చేసివేయడమో జరుగుతుందంతే.

ఒక వస్తువు అభివృద్ధిక్రమంలోని వైరుధ్యాల ప్రత్యేకతను, వాటి సమస్తత్వం లేక అంతస్సంబంధాలలోని వాటి ప్రత్యేకతను వెల్లడించడానికి, అంటే ఆ క్రమం సారాంశాన్ని వెల్లడి చేయడానికి, ఆ క్రమంలోని ప్రతి వైరుధ్యపు రెండు కోణాల ప్రత్యేకతనూ వెల్లడించడం ఆవశ్యకం; లేనిపక్షంలో ఆ క్రమం సారాంశాన్ని కనుగొనడం అసాధ్యమే అవుతుంది. ఇదికూడ మనం అత్యంత శ్రద్ధాసక్తులతో అధ్యయనం చేయవల్సిన విషయమే.

ఏ పెద్ద పరిణామం లేక వస్తువిశేషం అభివృద్ధిక్రమంలోనైనా అనేక వైరుధ్యాలు వుంటాయి. ఉదాహరణకు, మరీ సంక్లిష్టమైన పరిస్థితులు కలిగివున్న

చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవ క్రమంలో సామ్రాజ్యవాదానికీ, చైనా సమాజంలోని పీడితవర్గాలన్నింటికీ నడుమగల వైరుధ్యం, భూస్వామ్య విధానానికీ, అశేష ప్రజానీకానికీ మధ్య వైరుధ్యం; కార్మిక వర్గానికీ, బూర్జువావర్గానికీ నడుమ వైరుధ్యం; ఒక వైపు రైతాంగం, పెటీ బూర్జువావర్గాలకు, మరోవైపు బూర్జువావర్గానికీ మధ్య వైరుధ్యం; వివిధ అభివృద్ధినిరోధక పాలక బృందాల నడుమే గల వైరుధ్యం, యిలా యిలా అనేక వైరుధ్యాలు వున్నాయి. ఈ వైరుధ్యాల్లో ప్రతి ఒక్కదానికీ దాని సొంత ప్రత్యేకత వుండడం మూలాన వీటినన్నిటినీ ఒకేవిధంగా చూచి వ్యవహరించలేము. పైగా ఈ ప్రతి వైరుధ్యంలోనూ వుండే రెండేసి కోణాల్లో ప్రతిదానికీ దాని సొంత విశిష్ట లక్షణాలుంటాయి గనుక వాటినిసైతం మనం ఒకేవిధంగా చూచి వ్యవహరించలేము. చైనా విప్లవంలో నిమగ్నమైవున్న మనం ఈ వైరుధ్యాలను వాటి ఏకమొత్తం లేక సమస్తత్వంలో, అంటే వాటి అంతస్సంబంధాలలో, చూచి అర్థంచేసుకోవడమేగాక, ఈ సమస్తత్వాన్ని అర్థంచేసుకునేందుకు ఏకైక మార్గంగా ప్రతి వైరుధ్యంలోని ఉభయ కోణాలనూ అధ్యయనం చేయాల్సివుంటుంది. వైరుధ్యపు ప్రతి కోణాన్నీ అవగాహన చేసుకోవాలని మనం అంటున్నామంటే, (1) ఆ ప్రతి కోణమూ ఏ ప్రత్యేక స్థితిలో వుంటుంది, (2) దాని విరుద్ధ కోణంపై ఆధారపడివున్నప్పుడూ, అలాగే వైరుధ్యంలో వున్నప్పుడూ - యీ రెండు సందర్భాల్లోనూ అది ఏ నిర్దిష్ట రూపాలు ధరిస్తుంది, (3) అలాంటి ప్రతి కోణమూ దాని విరుద్ధ కోణంతో సంఘర్షించేటప్పుడు - ఆ ఉభయ కోణాలూ పరస్పరాధారితంగా వున్నప్పుడూ, అలాకాక ఘర్షణ మార్గంలో (వైరుధ్యంలో) వున్నప్పుడూ, వాటినడుమ పరస్పరాధారత భగ్నమైపోయిన తర్వాతా - ఏ నిర్దిష్ట పద్ధతులు ఆ పోరాటంలో ప్రయోగించబడుతున్నాయి అనే అంశాలన్నింటినీ అర్థంచేసుకోవాలని మనం అంటున్నామన్న మాట. ఈ సమస్యలను అధ్యయనం చేయడం ఎంతో ముఖ్యం. మార్క్సిజంలో అత్యంత ముఖ్యమైన అంశం, మార్క్సిజానికి జీవాత్మ, నిర్దిష్ట పరిస్థితుల నిర్దిష్ట విశ్లేషణే నన్నప్పుడు లెనిన్ సూచించిన అంతరార్థంకూడ యిదే.[12] మన పిడివాదులు లెనిన్

[12] చూడు : వి. ఐ. లెనిన్, కమ్యూనిజం, 1920 జూన్ 12. దానిలో హంగరీ కమ్యూనిస్టు పార్టీ నాయకుడు బేలా కున్‌ను విమర్శిస్తూ, అతడు(బేలా కున్) " మార్క్సిజంలోని అత్యంత సారభూతమైన అంశాన్ని, మార్క్సిజం జీవాత్మను, నిర్దిష్ట పరిస్థితుల నిర్దిష్ట విశ్లేషణను

బోధనలను ఉల్లంఘించారు. దేని నిర్దిష్ట విశ్లేషణకేగానీ వాళ్లు తమ బుర్రలెన్నడూ ఉపయోగించరు. తమ రచనలు,ప్రసంగాల్లో వాళ్లు సారమసలే లేని దిమ్మెస భాష్యాలు (stereotypes) వాడుతూ, తద్వారా మన పార్టీలో ఒక చాల చెడ్డ పనివిధానం సృష్టిస్తూ వుంటారు.

ఏదైనా సమస్యను అధ్యయనం చేసేటప్పుడు మనం స్వీయమానసికత్వాన్ని, ఏకపక్షతను, పైపై విచారణాతత్వాన్ని వర్జించాలి. స్వీయమానసికంగా వుండడమంటే సమస్యలను వస్తుగతంగా (objectively) చూడకపోవడం, అంటే సమస్యల పరిశీలనలో భౌతికవాద దృక్పథాన్ని అవలంబించకపోవడం అని అర్థం. నా **ఆచరణ గురించి** వ్యాసంలో నేనీ విషయం చర్చించాను. ఏకపక్షంగావుండడం అంటే సమస్యలను అన్నివైపులనుండి చూచి పరిశీలించకపోవడ మన్నమాట. చైనానుమట్టుకే అర్థంచేసుకోవడం, అయితే జపాన్‌ను అర్థంచేసుకోకపోవడం; కమ్యూనిస్టు పార్టీని మట్టుకే అర్థంచేసుకొనడం కాని కొమింటాంగ్‌ను అర్థం చేసుకోకపోవడం; కార్మిక వర్గాన్నిమట్టుకే అర్థంచేసుకొనడం కాని బూర్జువావర్గాన్ని అర్థం చేసుకోకపోవడం; రైతాంగాన్నిమాత్రమే అర్థంచేసుకొనడం కాని భూస్వాములను అర్థం చేసుకోకపోవడం; అనుకూల పరిస్థితుల్నిమాత్రమే అర్థంచేసుకొనడం కాని ప్రతికూల పరిస్థితులను అర్థం చేసుకోకపోవడం; విడి విడి భాగాలనుమాత్రమే అర్థంచేసుకొనడం కాని వస్తుసర్వస్వాన్ని (మొత్తాన్ని whole) అర్థం చేసుకోకపోవడం; లోపాలనుమట్టుకే అర్థంచేసుకొనడం కాని సాధించిన విజయాలను అర్థం చేసుకొనలేక పోవడం; వాది కేసునుమాత్రమే అర్థంచేసుకొనడం కాని ప్రతివాది కేసును అర్థం చేసుకోకపోవడం; రహస్య విప్లవ కృషినిమాత్రమే అర్థంచేసుకొనడం కాని బాహాట విప్లవ కృషినిఅర్థం చేసుకొనకపోవడం, యిలా యిలా ఎన్నో ఉదాహరణ లివ్వవచ్చు. ఒక్కమాటలో, ఒక వైరుధ్యపు ఉభయ కోణాల నిజలక్షణాలను అర్థం చేసుకోకపోవడ మన్నమాట. లేదా దీన్నే విడి భాగాల్నే చూచి వస్తుమొత్తాన్ని చూడకపోవడం, చెట్లనే చూచి అడవిని చూడకపోవడం అనికూడ అనవచ్చు. ఈ విధంగానైతే ఏదైనా వైరుధ్యం పరిష్కారానికి ఒక పద్ధతి కనుగొనడమే

---

**విడిచివేస్తున్నాడు**" అని రాసాడు లెనిన్ [ సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1950, సంపుటం XXXI, పుట 143 ].

అసాధ్యమవుతుంది; విప్లవ కర్తవ్యాలు నెరవేర్చడం అసాధ్యం అవుతుంది; నియమితకార్యాలు చక్కగా నిర్వర్తించడంగాని, పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని సరిగా సాగించడంగాని అసాధ్యమవుతుంది. యుద్ధకళగురించి చర్చిస్తూ, " నీ శత్రువుగురించి తెలుసుకో, నీగురించికూడ నీవు తెలుసుకో; అప్పుడు నీవు ఓటమి ప్రమాదం లేకుండా వంద యుద్ధాలైనా చేయగలవు"[13] అని సన్ వూ జూ అన్నప్పుడు అతడు యుద్ధంలోని ఉభయపక్షాలను గురించీ ప్రస్తావిస్తున్నాడన్నమాట. అలాగే, "ఉభయపక్షాలు చెప్పేదీ విను; అప్పుడు నీకు వివేకప్రకాశం కలుగుతుంది. లేక ఏదో ఒక పక్షానికే చెవి ఒగ్గావో అవివేకపు అంధకారమే నిన్ను అలముకుంటుంది " అని టాంగ్ రాజవంశానికి చెందిన వీ చెంగ్ [14] అన్నప్పుడు అతడుకూడ ఏకపక్షత్వపు తప్పును తెలుసుకొనే అన్నాడన్నమాట. కాని మన కామ్రేడ్లు తరచూ సమస్యలను ఏకపక్షంగా పరికిస్తూంటారు; అందువల్ల ఆకస్మిక అడ్డంకులకు ఢీ కొట్టుకుంటూ వుంటారు. షూ హూ చువాన్ నవలలో సుంగ్ చియాంగ్ చూ గ్రామంపై మూడు సార్లు దాడి చేస్తాడు.[15] అయితే స్థానిక పరిస్థితులగురించి తెలియక పోవడం, తప్పుడు పద్ధతులు ఉపయోగించడంవల్ల అతడు మొదటి రెండు పర్యాయాలూ ఓటమి పాలవుతాడు. ఆనక అతడు తన పద్ధతి మార్చుకుంటాడు. మొదట అక్కడి స్థానిక పరిస్థితులగురించి దర్యాప్తుచేస్తాడు. అక్కడి చిక్కుతోవలన్నింటిగురించి బాగా తెలిసి పెట్టుకుంటాడు. తర్వాత భేదోపాయంతో లీ, హూ, చూ గ్రామాలమధ్య వుండే పొత్తును భగ్నం చేస్తాడు. ఒక విదేశీ గాథలో వర్ణించే ట్రోజన్ గుఱ్ఱంలాంటి జిత్తువేస్తూ, తన మనుషులు మారువేషాలు ధరించి, శత్రుశిబిరంలో దూరి పొంచివుండేట్లు చేస్తాడు. చివరకు [అదనుచూసుకుని

---

[13] సన్ వూ జూ, లేక సన్ వూ, లేక సన్ జూ అనీ పిలవబడే వ్యక్తి క్రీస్తు పూర్వం 5వ శతాబ్దానికి చెందిన ఒక సుప్రసిద్ధ చైనా యోధుడు, యుద్ధవిజ్ఞానవేత్త. అతడు యుద్ధకళపై సన్ జూ అనే 13 అధ్యాయాల గ్రంథాన్ని రచించాడు. ఇక్కడ యిచ్చిన ఉల్లేఖన అందులోని " దాడి వ్యూహం " అనే 3వ అధ్యాయంనుండి తీసుకోబడ్డది.

[14] వీ చెంగ్ (క్రీ.శ. 580-643) టాంగ్ రాజవంశానికిచెందిన రాజనీతిజ్ఞుడు, చరిత్రకారుడు.

[15] షూ హూ చువాన్ (నీటి వార) అనే ప్రఖ్యాత 14వ శతాబ్దపు చైనా నవలలో ఉత్తరాది సుంగ్ రాజవంశపు చివరిరోజుల్లో జరిగిన ఒక రైతు యుద్ధం వర్ణించబడింది. ఆ నవలలోని కథానాయకుడు సుంగ్ చియాంగ్ తన స్థావరం ఏర్పాటుచేసుకునివుండిన లియాంగ్‌షాన్పోకు సమీపంలో చూ గ్రామం వుండింది. ఆ గ్రామపెద్ద, చూ చావో ఫెంగ్, ఒక నిరంకుశ భూస్వామి.

దాడి చేసి] మూడోసారి గెలుపు సాధిస్తాడు. భౌతికవాద గతితర్కాన్ని ప్రదర్శించే యిలాంటి ఉదాహరణలు ఈ **షూ హూ చువాన్** నవలలో యింకెన్నో వున్నాయి గాని అన్నింటిలోకీ చూ గ్రామంపై చేసిన ఈ మూడు దాడుల ఘట్టమే అత్యుత్తమమైంది.

లెనిన్ యిలా అంటాడు :

> **ఒక వస్తువుగురించి మనం నిజంగా తెలుసుకోవాలంటే మనం దాని వివిధ పక్షాలు అన్నింటినీ, దాని సంబంధాలన్నింటినీ, దాని "సంధానాలు" అన్నింటినీ మన పరిధిలోనికి తీసుకుని అధ్యయనం చేయాల్సివుంటుంది. దీన్ని మనం సంపూర్ణంగానైతే ఎన్నడూ సాధించలేముగాని, సర్వతోముఖ అధ్యయనం తప్పక చేయాలనడం తప్పుల్నీ, అతికాఠిన్యాన్నీ (rigidity) నివారించేందుకు ఒక ముందు జాగ్రత్త చర్య అని చెప్పవచ్చు.**[16]

మనం ఆయన చెప్పింది గుర్తుంచుకోవాలి. పై పై పరిశీలన అంటే ఒక వైరుధ్యపు నిజలక్షణాలను వాటి ఏకమొత్తంలోగాని, లేక వాటి ప్రతి కోణపు నిజలక్షణాలనుగాని యోచనలోకి తీసుకొనకపోవడమన్నమాట. అంటే ఒక వస్తువుగురించి లోతుగా పరిశోధించాల్సిన, దాని వైరుధ్యపు నిజలక్షణాలను సూక్ష్మంగా అధ్యయనం చేయాల్సిన ఆవశ్యకతను నిరాకరించడం; కాని, అందుకు బదులు, ఆ వస్తువును, దాని వైరుధ్యాన్ని కేవలం దూరంనుండి ఆషామషీగా పరికించడం, దాని ఏవో కొన్ని రూపురేఖలు లీలగా గమనించిన మరుక్షణమే ఆ వైరుధ్యాన్ని పరిష్కరించడానికి (ఒక ప్రశ్నకు జవాబివ్వడానికి, లేక ఒక తగువు తీర్చడానికి, లేక ఒక పని చేపటడానికి, లేక ఒక సైనిక చర్యను నిర్వహించడానికి) పూనుకోవడమన్నమాట. ఈ విధంగా పనులు చేయబోతే అది తప్పక కష్టనష్టాలకు దారితీస్తుంది. చైనాలో మన పిడివాద, అనుభవవాద కామ్రేడ్లు తప్పులెందుకు చేశారయ్యా అంటే దానికి కారణం ఖచ్చితంగా యిదేనని - అంటే వస్తువులను, విషయాలను స్వీయమానసిక, ఏకపక్ష, పై పై పరిశీలనాధోరణిలో చూచి వ్యవహరించడమేనని చెప్పకతప్పదు. ఏకపక్షంగా, పై

---

16 వి.ఐ. లెనిన్, "ట్రేడ్ యూనియన్లగురించి మరొక సారి - ప్రస్తుత పరిస్థితి, ట్రాట్స్కీ, బుఖారిన్‌ల తప్పులు, " (1921 జనవరి), ఎంపికచేసిన రచనలు, ఇంగ్లీషు ప్రచురణ, ఇంటర్నేషనల్ పబ్లిషర్స్, న్యూయార్క్, 1943, సంపుటం IX, పుట 66.

పై పరిశీలనాధోరణిలో వుండడం అంటే అదే సమయంలో స్వీయమానసికంగా వుండడమే అవుతుంది. ఎందుకంటే భౌతిక వస్తువులన్నీ యథార్థానికి పరస్పర అంతస్సంబంధాలు కలిగి, అంతర్గత సూత్రాలచే శాసించబడుతుంటాయి. కాని ఆ వస్తువులు, విషయాలను నిజంగా అవి ఉన్నవిధంగా చూచి తలపోయడంకంటే కొందరు వాటిని ఏకపక్షంగా, పై పై పరిశీలనా దృష్టితోమాత్రమే చూస్తారు; వాటి అంతస్సంబంధాలు, వాటి అంతర్గత సూత్రాలగురించి ఏ మాత్రం తెలవకుండా వుంటారు. అందువల్ల వారి పద్ధతి స్వీయమానసికమైనదికూడ నని గ్రహించాలి.

ఒక వస్తువు అభివృద్ధిలోని విరుద్ధాంశాల చలనానికి సంబంధించిన క్రమం మొత్తంలో, ఆ విరుద్ధాంశాల పరస్పర అంతస్సంబంధాలలోనూ, వాటి కోణాలు ప్రతిదానిలోనూకూడ, కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి, మనం వాటిపట్ల శ్రద్ధాసక్తులు చూపించాల్సివుంటుందన్న మాత్రమే కాదు. ఆ క్రమంలోని ప్రతి దశలోపైతం కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి, మనం వాటిపట్లకూడ శ్రద్ధాసక్తులు చూపించాల్సివుంటుందని తెలుసుకోవాలి.

ఒక వస్తువు అభివృద్ధి క్రమంలోని మౌలిక వైరుధ్యం, ఈ మౌలిక వైరుధ్యంచే నిర్ణీతమయ్యే ఆ క్రమం సారాంశం - యివి రెండూ ఆ అభివృద్ధి క్రమం పూర్తయేంతవరకు అదృశ్యం కావు. అయితే అది ఒక సుదీర్ఘ క్రమమయ్యే పక్షంలో దానిలోని ప్రతి దశలోనూ పరిస్థితులు విభిన్నంగా వుంటుంటాయి. కారణమేమంటే, వస్తువు అభివృద్ధి క్రమంలోని మౌలిక వైరుధ్యం నిజస్వభావం, ఆ క్రమం సారాంశం మారకుండా వుండేటప్పటికీ, ఈ సుదీర్ఘ క్రమంలో ఒక దశనుండి మరొక దశకు సాగిపోయేకొద్దీ మౌలిక వైరుధ్యం మరింత మరింత తీవ్రతరంగా రూపొందుతూ వుంటుంది. దానికితోడు ఆ మౌలిక వైరుధ్యంచే నిశ్చయింపబడే లేక ప్రభావితమయ్యే యితర అనేక పెద్ద,చిన్న వైరుధ్యాలలో కొన్ని మరింత తీవ్ర తరమవడం, కొన్ని తాత్కాలికంగా లేదా పాక్షికంగా పరిష్కారమవడం లేదా ఉపశమింప బడడం, యింకొన్ని కొత్త వైరుధ్యాలు పుట్టుకురావడం జరుగుతూంటుంది. కనుక ఆ క్రమంలో అనేక దశలు తటస్థిస్తుంటాయి. అందుచేత ఒక వస్తువు వికాసక్రమంలోని వివిధ దశలపట్లగనుక మనం శ్రద్ధాసక్తులు చూపించనట్లయితే, అప్పుడు మనం ఆ క్రమంలోని వైరుధ్యాల విషయంలో సవ్యంగా వ్యవహరించ లేకపోతాము.

ఉదాహరణకు, స్వేచ్ఛాయుత పోటీ యుగపు పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా అభివృద్ధిచెందినప్పుడు మౌలిక వైరుధ్యంతో తలపడే రెండు వర్గాల - అట్టడుగు కార్మికవర్గం, బూర్జువావర్గాల - వర్గస్వభావంలోగాని, లేక సమాజపు పెట్టుబడిదారీ సారాంశంలోగాని ఏ మార్పూరాలేదు. అయితే ఈ రెండు వర్గాల నడుమ వైరుధ్యం తీవ్రతరమైంది; గుత్త పెట్టుబడికీ, గుత్తేతర పెట్టుబడికీ మధ్య వైరుధ్యం ఆవిర్భవించింది; వలసవాద శక్తులకు, వలసలకు నడుమ వైరుధ్యం తీవ్రతరమైంది; వాటి అసమాన అభివృద్ధులవల్ల పెట్టుబడిదారీ దేశాలలోనే వాటిలో వాటికిగా తలయెత్తిన వైరుధ్యాలు మరీ పదునుగా తమ్ముతాము వెల్లడి చేసుకో సాగాయి. ఈ విధంగా పెట్టుబడిదారీ విధానపు ప్రత్యేక దశయైన సామ్రాజ్యవాదం అవతరించింది. ఈ [ప్రత్యేక దశలోని] వైరుధ్యాలను లెనిన్, స్టాలిన్‌లు సరిగ్గా వివరించి, వాటి పరిష్కారానికిగాను కార్మికవర్గ విప్లవపు సిద్ధాంతము, ఎత్తుగడలను సరిగ్గా రూపొందించినందువల్లే - ఖచ్చితంగా ఆ కారణంగానే - లెనినిజం అంటే సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవాల యుగపు మార్క్సిజం అని తెలుసుకోవాలి.

ఉదాహరణకు, **1911** విప్లవంతో[17] ప్రారంభమైన చైనా బూర్జువా ప్రజాస్వామిక విప్లవక్రమాన్నే తీసుకుందాం. దానికికూడ అనేక, స్పష్టంగా వేర్వేరైన దశలున్నాయి. ప్రత్యేకించి, బూర్జువా నాయకత్వం కాలంలోని విప్లవం,

---

17 1911 విప్లవం, చింగ్ రాజవంశపు నిరంకుశ పాలనను కూలద్రోసిన బూర్జువా విప్లవం. ఆ సంవత్సరం అక్టోబరు 10వ తేదీనాడు చింగ్ రాజవంశపు నూతన సైన్యంలోని ఒక ముఖ్య విప్లవకారుల ప్రభావంలో హూపే రాష్ట్రంలోని వూచాంగ్ పట్టణంలో తిరుగుబాటు చేసింది. అప్పుడుండిన బూర్జువా, పెటీ బూర్జువా విప్లవ సంఘాలు, కార్మికులు, కర్షకులు, సైనికుల విస్తృత జనసందోహాలు ఈ తిరుగుబాటుకు మద్దతుగా ఎంతో ఉత్సాహంతో ప్రతిస్పందించారు. అచిర కాలంలో చింగ్ రాజవంశ పాలన శిథిలమై పోయింది. 1912 జనవరిలో సన్ యట్ సేన్ తాత్కాలిక అధ్యక్షునిగా తాత్కాలిక చైనా రిపబ్లిక్ ప్రభుత్వం స్థాపింపబడింది. ఈ విధంగా రెండు వేల ఏళ్లకుపైగా మనివచ్చిన చైనాదేశ ఫ్యూడల్ రాచరిక వ్యవస్థ పరిసమాప్తం గావించబడింది. ప్రజాస్వామిక రిపబ్లిక్ భావన ప్రజల హృదయాల్లో లోతుగా పాదుకుపోయింది. కాని విప్లవానికి నాయకత్వం వహించిన బూర్జువావర్గం చాల రాజీ స్వభావంతో వుండింది. గ్రామీణ ప్రాంతాల్లో భూస్వామ్య వర్గాల ఫ్యూడల్ పాలనను నిర్మూలించడానికి రైతాంగ ప్రజానీకాన్ని విస్తృత స్థాయిలో సమీకరించకపోగా ఈ బూర్జువా వర్గం సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వత్తిళ్లకు లొంగి రాజ్యాధికారాన్ని ఒక ఉత్తరాది యుద్ధప్రభువైన యువాన్ షీ కై చేతికి అప్పగించింది. ఫలితంగా విప్లవం చివరకు విఫలమైంది.

కార్మికవర్గ నాయకత్వ కాలంలోని విప్లవం రెండు విస్తృతంగా భిన్నమైన చారిత్రక దశల్ని సూచిస్తాయి. మరో విధంగా చెబితే, కార్మికవర్గ నాయకత్వం విప్లవపు మొత్తం రూపురేఖల్ని మౌలికంగా మార్చివేసింది. వర్గాల నూతన శ్రేణీకరణను తీసుకు వచ్చింది. రైతాంగ విప్లవంలో ఒక బ్రహ్మాండమైన వెల్లువకు దారితీసింది. సామ్రాజ్యవాదానికీ, భూస్వామ్య విధానానికీ వ్యతిరేకంగా సాగే విప్లవానికి ఒక సమగ్రతను కలగజేసింది. ప్రజాస్వామిక విప్లవంనుండి సోషలిస్టు విప్లవానికి పరివర్తన సాధ్యపడే అవకాశాన్ని సృష్టించింది. ఇలా, ఇలా ఎన్నో చేసింది. విప్లవం బూర్జువా నాయకత్వంకింద వుండినప్పుడు వీటిలో ఏ ఒక్కటీకూడ సాధ్యమైవుండలేదు. మొత్తం విప్లవ క్రమంలోని మౌలిక వైరుధ్యం స్వభావంలోనైతే మార్పేదీ సంభవించకున్నా, అంటే ఆ క్రమపు సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక, ప్రజాస్వామిక విప్లవకర స్వభావంలో (దీనికి విరుద్ధమైనది దాని, అంటే సమాజపు, అర్ధ వలస, అర్ధ భూస్వామ్య స్వభావం) మార్పేదీ కలగకున్నా, రెండు దశాబ్దాలకుపైగా గడిచిపోయిన పరిణామాల క్రమంలో ఈ విప్లవ క్రమం అనేక అభివృద్ధి దశలగుండా పయనించింది. ఈ కాలావధిలో ఎన్నో మహత్తర ఘటనలు - 1911 విప్లవ వైఫల్యం, ఉత్తరాది యుద్ధప్రభువుల ప్రభుత్వ స్థాపన, ప్రథమ జాతీయ ఐక్య సంఘటన ఏర్పాటు - 1924-27 విప్లవం,[18] ఐక్యసంఘటన విచ్ఛిన్నం - ప్రతీఘాత విప్లవం పంచకు

---

[18] మొదటి విప్లవ అంతర్యుద్ధం అనికూడ పిలవబడే 1924-27 విప్లవం ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక, భూస్వామ్య వ్యతిరేక విప్లవ పోరాటం. దాని ప్రధాన సారవిషయం చైనా కమ్యూనిస్టు పార్టీ, కొమింటాంగ్‌ల సహకారం ప్రాతిపదికన జయప్రదంగా నిర్వహించబడ్డ ఉత్తరాది దండయాత్ర. క్వాంగ్‌టుంగ్ రాష్ట్రంలోని విప్లవ స్థావరప్రాంతాలను సుదృఢపర్చుకున్న తర్వాత, ఈ రెండు పార్టీలచే సంయుక్తంగా ఏర్పాటుచేయబడ్డ విప్లవ సైన్యం సామ్రాజ్యవాదులు పెంచిపోషిస్తూండిన ఉత్తరాది యుద్ధప్రభువులకు వ్యతిరేకంగా 1926 జూలైలో దాని ఉత్తరదేశ దండయాత్రను ఆరంభించింది. విశాల కార్మిక, . కర్షక ప్రజాసందోహాల ఆదరాభిమానాలతో కూడుకున్న అండదండలు దానికి లభించాయి. 1926 ఉత్తరార్ధంలోనూ, 1927 పూర్వార్ధంలోనూ యాంగ్జే, హువాంగ్ హో(పసుపు నది) నదీతీరాలపంటి వుండే అనేక రాష్ట్రాలను విప్లవ సైన్యం ఆక్రమించుకుంది. విప్లవం యిలా విజయవంతంగా పురోగమిస్తూండగా, కొమింటాంగ్‌లోపలే వుండిన, చియాంగ్ కై షేక్, వాంగ్ చింగ్ వీ ల నాయకత్వంలోని (వీరిద్దరూ దళారీ, భూస్వామ్య వర్గాలకు ప్రాతినిధ్యం వహిస్తూండినారు) అభివృద్ధినిరోధక ముఠాలు సామ్రాజ్యవాదుల ప్రోత్సాహప్రోద్బలాలతో రెండు విప్లవప్రతీఘాతక తిరుగుబాట్లు - మొదటిది 1927 ఏప్రిల్‌లోనూ, రెండోది 1927 జూలైలోనూ - చేశారు. అప్పట్లో చైనా కమ్యూనిస్టు పార్టీలో, చెన్ టూ సూ ప్రాతినిధ్యంలో, నెలకొనివుండిన కుడి అవకాశవాద భావాలు క్రమేపీ ఒక లొంగుబాటు పంథాగా పరిణమించాయి. అందుచేత కొమింటాంగ్‌లోని పైన పేర్కొన్న (చియాంగ్ కై షేక్, వాంగ్ చింగ్ వీ ల) అభివృద్ధినిరోధక ముఠాలు చేసిన హఠాత్ దాడులను ఫలప్రదంగా ఎదిరించగల శక్తివంతమైన ప్రతిఘటనను ఆర్గనైజుచేసే స్థితిలో పార్టీగాని, ప్రజలుగాని లేకుండిరి పర్యవసానంగా విప్లవం ఓటమి పాలైంది.

బూర్జువావర్గం పారిచేరడం, నూతన యుద్ధప్రభువుల మధ్య యుద్ధాలు, వ్యవసాయ విప్లవ యుద్ధం,[19] రెండవ జాతీయ ఐక్యసంఘటన ఏర్పాటు, జపాన్ వ్యతిరేక ప్రతిఘటనా యుద్ధం - సంభవించాయి. ఈ వివిధ దశల్ని స్పష్టంగా వేరుచేసి చూపే ఆయా ప్రత్యేక లక్షణాలుకూడ మనకు కనిపిస్తాయి - ఉదాహరణకు, కొన్ని వైరుధ్యాలు తీవ్రతరమవడం (ఉదాహరణకు, వ్యవసాయ విప్లవ యుద్ధం, నాలుగు ఈశాన్య రాష్ట్రాలపై జపాన్ దురాక్రమణ[20]); ఇతర వైరుధ్యాలు పాక్షికంగా లేదా తాత్కాలికంగా పరిష్కారంకావడం (ఉదాహరణకు, ఉత్తరాది యుద్ధప్రభువుల నాశనం, భూస్వాముల భూముల్ని మనం స్వాధీనం చేసుకొనడం); ఇంకొన్ని యితర వైరుధ్యాలు ఆవిర్భవించడం (ఉదాహరణకు, నూతన యుద్ధ ప్రభువులనడుమ ఘర్షణలు, దక్షిణాదిలో మనం విప్లవ స్థావర ప్రాంతాలు కోల్పోయినపిదప భూస్వాములచే భూముల పునఃస్వాధీనం), వగైరా.

ఒక వస్తువు అభివృద్ధిక్రమంలోని ప్రతి దశలోనూవుండే వైరుధ్యాల ప్రత్యేకతల్ని అధ్యయనం చేసేటప్పుడు మనం వాటిని, వాటి అంతస్సంబంధాలు లేక వాటి ఏకమొత్తంలో గమనించి చూడడమేగాక, ప్రతి వైరుధ్యానికీ వుండే ఉభయకోణాలనుసైతం పరీక్షగా చూడాల్సివుంటుందికూడ.

ఉదాహరణకు, కొమింటాంగ్, కమ్యూనిస్టు పార్టీలగురించే యోచిద్దాం. ఒక కోణాన్ని, కొమింటాంగ్ విషయాన్ని తీసుకుందాం. ప్రథమ ఐక్యసంఘటన కాలంలో రష్యాతో పొత్తు, కమ్యూనిస్టు పార్టీతో సహకారం, రైతులు, కార్మికులకు సహాయం అనే సన్ యట్ సేన్ రూపొందించిన మూడు గొప్ప విధానాలను కొమింటాంగ్ అమలు చేసింది. కనుక అప్పుడు అది సత్తువగా, విప్లవకరంగా, ప్రజాస్వామిక విప్లవంకోసం ఏర్పడిన వివిధ వర్గాల కూటమిగా

---

19 వ్యవసాయ విప్లవ యుద్ధం చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో చైనా ప్రజలు 1927నుండి 1937దాకా సాగించిన విప్లవ పోరాటం. ఎర్ర రాజ్యాధికారం స్థాపన, అభివృద్ధిసేత, కొమింటాంగ్ అభివృద్ధినిరోధక పాలనకు వ్యతిరేకంగా వ్యవసాయ విప్లవాన్ని, సాయుధ ప్రతిఘటనను వ్యాపింపజేయడం దీని ప్రధాన సారవిషయంగా వుండింది. ఈ విప్లవ యుద్ధం రెండవ విప్లవకర అంతర్యుద్ధంగాకూడ పేరుపొందింది.

20 నేటి లియావోనింగ్, కిరిన్, హైలుంగ్‌కియాంగ్ రాష్ట్రాలకూ, గొప్ప గోడ (చైనా గోడ) కు ఉత్తరంగావుండే హోపే రాష్ట్రపు ఈశాన్యభాగానికీ అనుగుణంగా వుండిన అప్పటి లియావోనింగ్, కిరిన్, హైలుంగ్‌కియాంగ్, జెహోల్ రాష్ట్రాలే యీ నాలుగు ఈశాన్య రాష్ట్రాలు. 1931లో సంభవించిన సెప్టెంబరు 18 ఘటన తర్వాత జపాన్ దురాక్రమణదారులు లియావోనింగ్, కిరిన్, హైలుంగ్‌కియాంగ్ లను ఆక్రమించుకున్నారు; ఆనక 1933 లో జెహోల్‌ను కైవసం చేసుకున్నారు.

వుండింది. అయితే, 1927 దరిమిలా కొమింటాంగ్ ఒక విరుద్ధస్థితికి మారింది; భూస్వాముల, బడాబూర్జువాల అభివృద్ధి నిరోధక ముఠాగా మారిపోయింది. కాని 1936 డిసెంబరులో జరిగిన సియాన్ ఘటన [21] తర్వాత అది మళ్లీ, జపాన్ సామ్రాజ్యవాదానికి సంయుక్త ప్రతిఘటన సమర్పించడానికిగాను అంతర్యుద్ధాన్ని అంతంచేసి, కమ్యూనిస్టు పార్టీతో సహకరించే దిశగా మారుతూవచ్చింది. ఈ మూడు దశల్లో కొమింటాంగ్ యొక్క ప్రత్యేక లక్షణాలిలా వుండినాయి. మరి ఈ ప్రత్యేక లక్షణాలు తల యెత్తడానికి కారణాలు వివిధమనుకోండి. ఇప్పుడు మరో కోణాన్ని, అంటే చైనా కమ్యూనిస్టు పార్టీని తీసుకుందాం. మొదటి ఐక్యసంఘటన కాలంలో చైనా కమ్యూనిస్టు పార్టీ శైశవ దశలో వుండింది. అయినా అది 1924-27 విప్లవానికి ధైర్యసాహసాలతో నాయకత్వం వహించింది; కాని విప్లవ స్వభావం, కర్తవ్యాలు, పద్ధతులను అవగాహనచేసుకోవడంలో అపరిపక్వత వెల్లడిచేసుకుంది. పర్యవసానంగా, ఈ విప్లవం మలి భాగంలో గోచరించిన చెన్ టూ సూ వాదం (Chen Tu-hsiuism)[22] దానికది బలంగా ప్రకటించుకొనడం సాధ్యపడింది;

---

21 చైనా ఎర్ర సైన్యం, ప్రజల జపాన్ వ్యతిరేక వుద్యమాల ప్రభావంలో చాంగ్ సూ లియాంగ్ నాయకత్వంలోని కొమింటాంగ్‌యొక్క ఈశాన్య సేన, యాంగ్ హూ చెంగ్ నాయకత్వంలోని 17వ రూట్ సేనలు చైనా కమ్యూనిస్టు పార్టీ ప్రతిపాదించిన జపాన్ వ్యతిరేక జాతీయ ఐక్యసంఘటన విధానాన్ని ఆమోదించాయి; అంతేకాక జపాన్‌ను ప్రతిఘటించడానికిగాను కమ్యూనిస్టు పార్టీతో ఐక్యత సాధించవల్సిందిగా చియాంగ్ కై షేక్‌ను డిమాండు చేశాయికూడ. అయితే చియాంగ్ కై షేక్ ఈ డిమాండును తోసిపుచ్చడమేకాక, యింకా మరింత విపరీత వైఖరి నవలంబించి, 'కమ్యూనిస్టుల అణచివేత' కని సైనిక సన్నాహాలు ఇతోధికంగావించడమేకాక, సియాన్‌లోని విద్యార్థి వుద్యమం, జపాన్ వ్యతిరేక వుద్యమాలపై దమనకాండ సాగించాడు. [దానితో బాగా విసిగి, ఆగ్రహంచెందిన ] చాంగ్ సూ లియాంగ్, యాంగ్ హూ చెంగ్‌లు 1936 డిసెంబరు 12వ తేదీనాడు సియాన్ ఘటన జరిపి, చియాంగ్ కై షేక్‌ను అరెస్టు చేశారు. ఈ సంఘటన అనంతరం చాంగ్ సూ లియాంగ్, యాంగ్ హూ చెంగ్‌ల దేశభక్తియుత చర్యకు చైనా కమ్యూనిస్టు పార్టీ తన దృఢమైన మద్దతు ప్రకటిస్తూనే, అదే సమయంలో జాతీయ ఐక్యత, జపాన్‌వ్యతిరేక ప్రతిఘటనల ప్రాతిపదికన ఈ సమస్యను పరిష్కరించాల్సివుంటుందనే అభిప్రాయం వ్యక్తం చేసింది. ఆనక, జపాన్‌కు వ్యతిరేకంగా పోరాడాలంటూ కమ్యూనిస్టు పార్టీ విధించిన షరతుల్ని డిసెంబరు 25వ తేదీనాడు చియాంగ్ కై షేక్ చే బలవంతంగా ఆమోదింపజేసి, పిదప విడుదలచేసి, నాంకింగ్‌కు తిరిగి పంపేసారు.

22 చెన్ టూ సూ మే 4 వుద్యమకాలమప్పుడు ఒక తీవ్రవాద (radical) ప్రజాస్వామ్యవాది. తదనంతరం, అక్టోబర్ సోషలిస్టు విప్లవ ప్రభావంలో అతడు చైనా కమ్యూనిస్టు పార్టీ సంస్థాపకుల్లో ఒకడయ్యాడు. పార్టీ ఏర్పడినపిదప ఆరేళ్లకాలంపాటు అతడు పార్టీ కేంద్ర కమిటీలో అగ్ర నాయకునిగా వుండినాడు.

చాలకాలంనుండి అతని ఆలోచన బాగా మితవాదధోరణిలో వుంటూ వచ్చింది. 1924-27 విప్లవ మలిభాగంలో అది ఒక ప్రాధేయపడే లొంగుబాటు విధానంగా పరిణమించింది. చెన్ టూ సూ ప్రాతినిధ్యంలోని లొంగుబాటువాదులు, " **రైతాంగ ప్రజానీకంపై, పట్టణ పెటీబూర్జువా, మధ్యబూర్జువావర్గాలపై పార్టీకున్న నాయకత్వాన్ని స్వచ్ఛందంగా వదులుకున్నారు. ప్రత్యేకించి, సాయుధ బలగాలపై పార్టీ నాయకత్వాన్ని వదిలివేసుకున్నారు. ఈ విధంగా వారు విప్లవ పరాజయానికి కారకులైనారు** " ( "ప్రస్తుత పరిస్థితి - మన కర్తవ్యాలు," మావో సే టుంగ్ ఎంపికచేసిన రచనలు, ఇంగ్లీషు ప్రచురణ, విదేశీ భాషా ప్రచురణాలయం, పెకింగ్, 1961, సంపుటం IV, పుట 171). 1927 ఓటమి దరిమిలా చెన్ టూ సూ, మరి గుప్పెడుమంది యితర లొంగుబాటువాదులు విప్లవం భవిష్యత్తుపై విశ్వాసాన్ని కోల్పోయి, దివాళాతత్వవాదులు (liquidationists) అయినారు. వాళ్లొక అభివృద్ధినిరోధక ట్రాట్స్కీయిస్టు వైఖరి నవలంబించి, ట్రాట్స్కీయిస్టులతో కత్తుకలిపి ఒక చిన్న పార్టీవ్యతిరేక బృందాన్ని ఏర్పాటు చేసారు. పర్యవసానంగా చెన్ టూ సూ ను 1929 నవంబరులో పార్టీనుండి బహిష్కరించడం జరిగింది. అతడు 1942లో మరణించాడు.

[ **చెన్ డూ క్స్యు** లేక **చెన్ టూ సూ :** పుట్టుక - **1879 అక్టోబరు 8** న, మరణం - **1942 మే 27**న. అన్వై రాష్ట్రంలోని హువాయినింగ్ కౌంటీలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించాడు. 1906 లో జపాన్‌లోని వసేడా విశ్వవిద్యాలయంలో చదివేటప్పుడే తీవ్రవాద విప్లవకర భావాలతో, అంతర్జాతీయతత్వంతో వుండేవాడు. 1907లో ఫ్రాన్సు వెళ్లి మూడేళ్లు అక్కడ ఉన్నత విద్యాభ్యాసనం చేశాడు. పాశ్చాత్య ప్రజాస్వామ్య, విశ్వమానవ (cosmopolitan) విలువలు బాగా పుణికిపుచ్చుకున్నాడు. తిరిగివచ్చిన పిదప 1911 విప్లవంలో పాల్గొన్నాడు. ఆనక యువాన్ షీ కై విప్లవద్రోహానికి వ్యతిరేకంగా పోరాటంలోకూడ పాల్గొని, విప్లవశక్తులు పరాజయంచెందడంతో జపాన్‌కు పారిపోయాడు. 1917లో పెకింగ్ జాతీయ యూనివర్సిటీలో సాహిత్యశాఖ డీన్‌గా అయి, విద్యార్థులను ప్రజాస్వామ్యం, సాంఘిక విప్లవాల దిశగా ప్రేరేపిస్తూ, సామ్రాజ్యవాద వ్యతిరేక మే 4 (1919) వుద్యమ సారథుల్లో ఒకడైనాడు. పర్యవసానంగా డీన్ పదవి కోల్పోవడమేగాక మూడు నెలలు జైలులో మగ్గాల్సివచ్చిందికూడ. విడుదలైనాక మార్క్సిజాన్ని పూర్తిగా ఆమోదించి, ప్రచారం చేయసాగాడు. 1920 మే లో షాంఘై నగరంలో చైనా కమ్యూనిస్టు పార్టీ సంస్థాపక సమావేశం ఏర్పాటుచేసి, అప్పటినుండి ఏడేళ్ల పాటు పార్టీలో ప్రథమ నాయకుడిగా ప్రధాన పాత్ర వహిస్తూ వచ్చాడు. 1922 నవంబరు-డిసెంబరులో మాస్కోలో జరిగిన 4వ కొమింటర్న్ కాంగ్రెసులో పాల్గొన్నాడు. అక్కడ రూపొందిన విధానం ప్రకారం అయిష్టంగానే అయినా కొమింటాంగ్-కమ్యూనిస్టుల పొత్తుకు గట్టి కృషి చేసాడు. ఆనక కొమింటర్న్ 1927లో ఈ తప్పులకంతటికీ బాధ్యుడు చెన్ టూ సూ యే నని నిందించి, ఆయన్ను నాయకత్వంనుండి తప్పించడం, 1929లో పార్టీనుండే బహిష్కరణ జరిగాయి. 1927తర్వాత ట్రాట్స్కీవాదులు, పార్టీలోని యితర అసమ్మతివాదుల్ని కూడగట్టి నాయకత్వం తిరిగి సంపాదించుకునేందుకు చెన్ టూ సూ విఫల ప్రయత్నాలెన్నో చేసాడు. 1932 అక్టోబరులో కొమింటాంగ్ (నాంకింగ్ )ప్రభుత్వం అతడ్ని కమ్యూనిస్టు విద్రోహి అనే నేరారోపణతో విచారించి, 15 ఏళ్ల జైలు శిక్ష విధించారు. ఐదేళ్ల కారావాసం తర్వాత చైనా-జపాన్ యుద్ధం బద్ధలవడంతో 1937 ఆగష్టులో పెరోల్‌మీద విడుదలై, 1938 చివర యుద్ధకాల రాజధాని చుంగ్‌కింగ్‌కు వచ్చాడు. కొంతకాలం తర్వాత బాగా జబ్బుపడి, అక్కడికి సమీపంలోని చియాంగ్ చింగ్ అనే ఒక చిన్న పట్టణంలో స్థిరపడి, చివరకు అక్కడే 1942 మే లో కన్నుమూసాడు. జీవితాంతం అన్యాయాలకు, అక్రమాలకు వ్యతిరేకంగా పోరాడుతూ, ప్రజాస్వామ్య

పర్యవసానంగా అది విప్లవ పరాజయాన్ని కలగజేసింది. 1927 తర్వాత కమ్యూనిస్టు పార్టీ వ్యవసాయ విప్లవ యుద్ధాన్ని సాహసికంగా నడిపించి, విప్లవ సైన్యాన్ని, విప్లవ స్థావరప్రాంతాలను సృష్టించుకున్నది. అయితే, అది యీ సారి దుస్సాహసవాద తప్పులు చేసింది; పర్యవసానంగా విప్లవ సైన్యానికీ, స్థావర ప్రాంతాలకూ రెంటికీ చాల తీవ్ర నష్టాలు వాటిల్లాయి. 1935నుండీ పార్టీ ఈ తప్పుల్ని సవరించుకుని, జపాన్‌కు వ్యతిరేకంగా ప్రతిఘటనకోసం నూతన ఐక్యసంఘటనకు నాయకత్వం వహిస్తున్నది. ఈ మహత్తర పోరాటం యిప్పుడు అభివృద్ధిచెందుతున్నది. ప్రస్తుత దశలోని కమ్యూనిస్టు పార్టీ రెండు విప్లవాల పరీక్షల్లో నిగ్గుదేలి, అపార అనుభవసంపద గడించుకునివున్న పార్టీ. కనుక ఈ మూడు దశల్లోనూ చైనా కమ్యూనిస్టు పార్టీకి పైన పేర్కొన్న విధంగా ప్రత్యేక లక్షణాలు వుండినాయి. ఈ లక్షణాలుకూడ వివిధ కారణాలనుండి జనించాయి. ఈ ప్రత్యేక లక్షణాల వరుసలు(సమితులు - sets) రెంటినీ అధ్యయనం చేయకుండా, వాటి అభివృద్ధికి చెందిన వివిధ దశల్లో ఈ రెండు పార్టీలనడుమ ఏర్పడివున్న ప్రత్యేక సంబంధాలను, అంటే ఐక్య సంఘటన ఏర్పాటు, ఆ ఐక్యసంఘటన విచ్ఛిన్నమవడం, మరో ఐక్యసంఘటన ఏర్పాట్లను మనం అర్థం చేసుకోలేము. ఆ మాటకు ఈ రెండు పార్టీల ప్రత్యేక లక్షణాల అధ్యయనానికీ మరింత మౌలికంగా ముఖ్యమైన దేమంటే, ఈ రెండు పార్టీల వర్గపునాదులను, ఆ ప్రాతిపదికల పర్యవసానంగా వివిధ కాలావధుల్లో ఈ ప్రతి పార్టీకి, యితర శక్తులకు నడుమ తలెత్తిన వైరుధ్యాలను పరిశీలించడం. ఉదాహరణకు, కమ్యూనిస్టు పార్టీతో దాని తొలి సహకార కాలంలో కొమింటాంగ్ విదేశీ సామ్రాజ్యవాదంతో వైరుధ్యంలో నిలిచి వుండింది; అందుచేత అది సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తిగా వుండింది. అయితే, మరో వైపున, అది దేశంలోని అశేష ప్రజానీకానికి విరుద్ధంగా వుండింది - మాటల్లోనైతే అది శ్రామిక ప్రజల ప్రయోజనార్థం యివి చేస్తాం, అవి చేస్తాం అంటూ ఎన్నో వాగ్దానాలు చేసినా, యథార్థానికి వారికి యిచ్చిందిమాత్రం

విధానాలు, విలువల్ని అపారంగా అభిమానిస్తూవచ్చిన చెన్ టూ సూ, 1929 తర్వాతికాలంలో స్టాలిన్ వ్యక్తిపూజను, నిరంకుశ, నియంతృత్వ విధానాలను నిరసిస్తూ, స్వేచ్ఛాయుత ఎన్నికలు, పత్రికా స్వాతంత్ర్యం, వాక్ సభా తదితర ప్రాథమిక స్వాతంత్ర్యాలను, ప్రజాస్వామిక వ్యవస్థను కోరుకుంటూ వచ్చాడు. తదనుగుణమైన ఒక ప్రజాస్వామిక, మానవతాపూర్ణ సోషలిజం కోరుకుంటూనే తుది శ్వాస విడిచాడు. చెన్ టూ సూ నిజమైన పాత్రగురించి మనం పునరాలోచన చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది].

బహుతక్కువ లేదా అసలేమీ లేదనికూడ చెప్పవచ్చు. పోతే కమ్యూనిస్టువ్యతిరేక యుద్ధం నిర్వహించిన కాలంలోనైతే కొమింటాంగ్ అశేష ప్రజానీకానికి వ్యతిరేకంగా సామ్రాజ్యవాదం, భూస్వామ్యవిధానాలతో చేతులు కలిపి విప్లవక్రమంలో ప్రజలు గెలుచుకున్న లాభాలన్నింటినీ తుడిచిపెట్టేసి, తద్వారా వారితో తనకున్న వైరుధ్యాల్ని తీవ్రతరం చేసుకున్నది. జపాన్ వ్యతిరేక యుద్ధం సాగిస్తున్న ప్రస్తుత దశలో కొమింటాంగ్ ఒక వైపున కమ్యూనిస్టు పార్టీతో, ప్రజలతో తన పోరాటాన్ని, వారిని పీడించడం, అణచివేయడాలను సడలించకుండానే, మరో వైపున జపాన్ సామ్రాజ్యవాదంతో వైరుధ్యం కలిగివుంటూ, ఆ నిమిత్తం కమ్యూనిస్టు పార్టీ సహకారం కోరుతూ వస్తున్నది. ఇక కమ్యూనిస్టు పార్టీ విషయానికొస్తే అది ఎప్పుడూకూడ , ప్రతి కాలావధిలోనూకూడ, సామ్రాజ్యవాదానికీ, ఫ్యూడలిజానికీ వ్యతిరేకంగా అశేష ప్రజా బాహుళ్యం పక్షాన నిలిచివుంది. అయితే, ప్రస్తుత జపాన్ వ్యతిరేక యుద్ధదశలో అది కొమింటాంగ్ పట్ల, స్వదేశీ భూస్వామ్య శక్తులపట్ల ఒక మెతక విధానం అవలంబించి వుంది. కారణం, జపాన్‌ను ప్రతిఘటించడానికి తానూ సిద్ధమే, అనుకూలమే నని కొమింటాంగ్ ప్రకటించివుండడంవల్లనే. పైన పేర్కొన్నటువంటి పరిస్థితుల మూలంగా ఈ రెండు పార్టీల నడుమ ఒకప్పుడు పొత్తు, ఒకప్పుడు వైరంగా సాగుతూ వస్తున్నది. పొత్తువున్న కాలావధుల్లోకూడ ఏకకాలంలో పొత్తు, పోరాటాలు రెండూ సాగే సంక్లిష్ట పరిస్థితులుసైతం తటస్థించకపోలేదు. కనుక, ఈ వైరుధ్యపు ఉభయ కోణాలకూ సంబంధించిన ప్రత్యేక లక్షణాలను మనం అధ్యయనం చేయని పక్షంలో, ఈ ప్రతి పార్టీకి వివిధ యితర శక్తులతోవున్న సంబంధాలనేగాక, ఈ రెండు పార్టీల మధ్యవున్న సంబంధాలనుసైతం మనం అర్థం చేసుకోలేకపోతాము.

కనుక ఏ విధమైన వైరుధ్యపు ప్రత్యేకతనేగాని అధ్యయనం చేసేటప్పుడు - ప్రతి చలనరూపంలోని వైరుధ్యమేగాని, ఆ చలనం అభివృద్ధికి సంబంధించిన ప్రతి క్రమంలోని వైరుధ్యం, ఆ ప్రతి క్రమంలోని వైరుధ్యానికిచెందిన రెండు లక్షణాలనే గాని, ఒక క్రమపు ప్రతి దశలోనూ సాక్షాత్కరించే వైరుధ్యం, ఇలాంటి వైరుధ్యపు ప్రతి దశలోని రెండు కోణాలనేగాని - యిలాంటి ఈ వైరుధ్యాలన్నింటి ప్రత్యేకతలను అధ్యయనం చేసేటప్పుడు, మనం స్వీయమానసికంగానో, యధేచ్ఛా చింతనతోనో వర్తించరాదు; వాటిని నిర్దిష్టంగా విశ్లేషించి చూడాల్సివుంటుంది. నిర్దిష్ట విశ్లేషణ లేనిదే ఏ వైరుధ్యపు

ప్రత్యేకతగురించైనా జ్ఞానం సమకూడదు. మన మెప్పుడూకూడ లెనిన్ మాటల్ని, నిర్దిష్ట పరిస్థితుల నిర్దిష్ట విశ్లేషణ అవసరమనే హితవును గుర్తుంచుకోవాలి.

ఇలాంటి నిర్దిష్ట పరిశీలనకు సంబంధించి మనకు అమోఘమైన నమూనాలు యిచ్చివెళ్ళినవారిలో మార్క్స్, ఏంగెల్సులు ప్రప్రథములని గమనించాలి.

వస్తువులలోని వైరుధ్యసూత్రాన్ని మార్క్స్, ఏంగెల్సులు సాంఘిక-చారిత్రక క్రమం అధ్యయనానికి ప్రయోగించినప్పుడు, ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు నడుమ వైరుధ్యాన్ని వాళ్లు కనుగొన్నారు. పీడక, పీడిత వర్గాలమధ్య వైరుధ్యాన్ని, దాని పర్యవసానంగా ఆర్థిక పునాదికీ, దాని పైకట్టడానికీ(రాజకీయాలు, భావజాలం వగైరాలకు) మధ్యగల వైరుధ్యాన్నికూడ కనుగొన్నారు. వివిధ రకాల వర్గ సమాజంలో ఈ వైరుధ్యాలెలా వివిధ రకాల సాంఘిక విప్లవాలకు అనివార్యంగా దారి తీస్తాయోకూడ వాళ్లు కనుగొన్నారు.

ఈ సూత్రాన్ని మార్క్స్ పెట్టుబడిదారీ సమాజపు ఆర్థిక నిర్మాణాన్ని అధ్యయనం చేసేందుకు అన్వయించినప్పుడు, ఈ సమాజంలో ప్రాథమిక వైరుధ్యం ఉత్పత్తి సాంఘిక స్వభావానికీ, యాజమాన్యం వ్యష్టి (ప్రైవేటు) స్వభావానికీ నడుమ గల వైరుధ్యమేనని ఆయన కనుగొన్నాడు. ఈ వైరుధ్యం, ప్రత్యేక (విడి విడి) సంస్థల్లోని ఉత్పత్తుల సంఘటిత స్వభావానికీ (organised character), సమాజం మొత్తంలోని ఉత్పత్తియొక్క అరాచక(అస్తవ్యస్త - anarchic) స్వభావానికీమధ్య వైరుధ్యంగా దాన్నది అభివ్యక్తం చేసుకుంటుంది. వర్గ సంబంధాల దృష్ట్యైనైతే ఈ వైరుధ్యం, బూర్జువా వర్గానికీ, కార్మికవర్గానికీ మధ్యగల వైరుధ్యంగా ప్రదర్శించుకుంటుంది.

వస్తువుల పరిధి అతివిస్తృతంగానూ, వాటి వికాసానికి ఒక పరిమితి అంటూ లేకుండానూ వుండడంవల్ల, ఒక సందర్భంగా విశ్వజనీనమైనది, మరొక సందర్భంగా ప్రత్యేకమైనదిగా రూపు దాలుస్తుంది. ఇందుకు విపర్యయంగా, ఒక సందర్భంగా ప్రత్యేకమైనది, మరొక సందర్భంగా విశ్వజనీనమైనదిగా రూపొందుతుందికూడ. పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉత్పత్తి సాంఘిక

స్వభావానికీ, ఉత్పత్తి సాధనాల వ్యష్టి (ప్రైవేటు) యాజమాన్యానికీ మధ్యవుండే వైరుధ్యం, పెట్టుబడిదారీ విధానం మనివుండే, అభివృద్ధిచెందే దేశాలన్నింటికీ సామాన్యమైనది; పెట్టుబడిదారీ విధానానికి సంబంధించినంతవరకు యిది దాని వైరుధ్యపు విశ్వజనీనతగా వుంటుంది. కాని పెట్టుబడిదారీ విధానపు ఈ వైరుధ్యం వర్గసమాజపు సాధారణ అభివృద్ధిక్రమంలో ఒక నిశ్చిత చారిత్రక దశకుమాత్రమే చెందేదని గమనించాలి; మొత్తంగా వర్గ సమాజమంతటిలోనూ వుండే ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు నడుమలి వైరుధ్యానికి సంబంధించినంతవరకు యిది (ఉత్పత్తి సాంఘిక స్వభావానికీ, ఉత్పత్తి సాధనాల ప్రైవేటు యాజమాన్యానికీ మధ్యవుండే వైరుధ్యం) వైరుధ్యపు ప్రత్యేకతగా వుంటుంది. అయితే, పెట్టుబడిదారీ సమాజంలోని ఈ వైరుధ్యాలన్నిటి ప్రత్యేకతలనూ విచ్ఛేదించి, విశ్లేషించే క్రమంలో, సాధారణంగా వర్గ సమాజ మంతటిలోనూ ఉత్పత్తి శక్తులకు, ఉత్పత్తి సంబంధాలకు నడుమవుండే వైరుధ్యపు విశ్వజనీనతను మార్క్స్ మరింత లోతుగా, మరింత సుయుక్తంగా, మరింత సంపూర్ణంగా వివరించాడనికూడ తెలుసుకోవాలి.

ప్రత్యేకమైనది విశ్వజనీనమైనదానితో ఐక్యమైవుండడంవల్ల, వైరుధ్యపు విశ్వజనీనత, అలాగే దాని ప్రత్యేకతకూడ, ప్రతిదానిలోనూ స్వతస్సిద్ధంగా, ప్రత్యేకతలో విశ్వజనీనత వసించే విధంగా, వుండడంచేత, మనం ఏదైనా వస్తువు లేక విషయాన్ని అధ్యయనం చేసేటప్పుడు, మనం దాని (వైరుధ్యంలోని) విశ్వజనీనతనూ, ప్రత్యేకతనూ రెంటినీ, వాటి అంతస్సంబంధాన్నీ కనుగొనడానికి ప్రయత్నించాలి. అంటే ఆ వస్తువు లేక విషయంలోని విశ్వజనీనత, ప్రత్యేకతలు రెంటినీ, దానిలోపలేవుండే వాటి అంతస్సంబంధాన్నీ కనుగొనడానికి ప్రయత్నించాలి; అలాగే ఆ వస్తువు లేక విషయానికి, దాని బయటవుండే అనేక యితరేతర వస్తువులు, విషయాలతోగల అంతస్సంబంధాన్ని కనుగొనడానికికూడ ప్రయత్నించాలి. స్టాలిన్ తన సుప్రసిద్ధ రచన, **లెనినిజం పునాదులు**, లో లెనినిజం చారిత్రక మూలాలను వివరించేటప్పుడు, లెనినిజం ఏ అంతర్జాతీయ పరిస్థితుల్లో ఆవిర్భవించిందో వాటిని విశ్లేషిస్తాడు; సామ్రాజ్యవాదంకింద పరాకాష్టకు చేరుకున్న పెట్టుబడిదారీ విధానపు వైరుధ్యాలను విశ్లేషిస్తాడు; ఈ వైరుధ్యాలు కార్మికవర్గ విప్లవాన్ని ఒక తక్షణ కార్యాచరణీయాంశంగా ఎలా రూపొందించాయో, పెట్టుబడిదారీ విధానంపై ప్రత్యక్ష దాడికి అనుకూల పరిస్థితుల్ని ఎలా సృష్టించాయో

ప్రదర్శిస్తాడు. అంతేకాదు, రష్యా లెనినిజానికి జన్మభూమి ఎందుకయ్యిందో, సామ్రాజ్యవాదంలోని సకల వైరుధ్యాలకూ జారిస్టు రష్యా కూటమికేంద్రం ఎందుకయిందో, అంతర్జాతీయ విప్లవకర కార్మికవర్గానికి అగ్రగామిగా రష్యన్ కార్మికవర్గం ఎలా రూపొందగలిగిందో ఆ కారణాలన్నిటినీ స్టాలిన్ విశ్లేషించి, వివరిస్తాడు. ఈ విధంగా, లెనినిజం సామ్రాజ్యవాదం, కార్మికవర్గ విప్లవాల యుగపు మార్క్సిజం ఎందుకు అయిందో చూపడంద్వారా స్టాలిన్ సామ్రాజ్యవాదంలోని వైరుధ్యపు విశ్వజనీనతను విశ్లేషిస్తాడు. అదే సమయంలో కార్మికవర్గ విప్లవపు సిద్ధాంతం, ఆచరణలకు రష్యా పుట్టినిల్లు ఎందుకు అయిందో, వైరుధ్యపు విశ్వజనీనత ఈ ప్రత్యేకతలో ఎలా యిమిడివుందో చూపడంద్వారా ఆయన ఈ సాధారణ వైరుధ్యంలోనే జారిస్టు రష్యన్ సామ్రాజ్యవాదపు ప్రత్యేకతను విశ్లేషిస్తాడు. వైరుధ్యపు ప్రత్యేకతను, విశ్వజనీనతను, వాటి అంతస్సంబంధాన్ని అర్థం చేసుకోవడానికి స్టాలిన్ చేసిన విశ్లేషణ మనకు ఒక చక్కని నమూనాగా ఉపకరిస్తుంది.

భౌతిక పరిణామాల అధ్యయనానికి గతితర్కాన్ని ఉపయోగించే విషయమై మార్క్స్, ఏంగెల్సులు, అలాగే లెనిన్, స్టాలిన్‌లు, మనమే విధంగానూ స్వీయమానసికంగాగాని లేక యధేచ్ఛావర్తనతోగాని వుండరాదని, కాగా ఈ పరిణామాల యథార్థ భౌతిక చలనానికిచెందిన నిర్దిష్ట పరిస్థితులనుండి వాటి నిర్దిష్ట వైరుధ్యాలను కనుగొనాలని, అలాంటి ప్రతి వైరుధ్యపు ప్రతి కోణంయొక్క నిర్దిష్ట పరిస్థితిని, ఆ వైరుధ్యాల నిర్దిష్ట అంతస్సంబంధాలను కనుగొనాలని మనకు ఉద్బోధిస్తున్నారు. మన పిడివాదులకు యిలాంటి అధ్యయన దృక్పథం లేదు; కనుక వాళ్లు దేన్నీ ఎన్నడూ సరిగా గ్రహించలేరు; సవ్యంగా చేయలేరు. మనం వారి వైఫల్యాన్ని చూచి జాగ్రత్త పడాలి; అధ్యయనానికి సంబంధించిన ఈ ఏకైక సరియైన దృక్పథాన్ని అలవర్చుకోవడానికి పాటుపడాలి.

వైరుధ్యపు సార్వత్రికత(విశ్వజనీనత)కు, ప్రత్యేకతకు మధ్యగల సంబంధం వైరుధ్యపు సాధారణ స్వభావానికీ, వ్యక్తిగత (విడి) స్వభావానికీ మధ్యగల సంబంధమే. మొదటిదానిద్వారా, అంటే సార్వత్రికతద్వారా, అన్ని క్రమాల్లోనూ ఆదినుండి తుదిదాకా వైరుధ్యం వుంటుంది, వాటిల్లో అలా సాగిపోతూంటుందని మనం అర్థం చేసుకుంటాము. చలనం, వస్తువులు, క్రమాలు, ఆలోచన - అన్నీ వైరుధ్యాలే. వైరుధ్యాన్ని నిరాకరించడమంటే

సర్వస్వాన్నీ (ప్రతిదాన్నీ) కాదనడమే. ఇది ఏ మినహాయింపుకూ తావివ్వని, దేశకాలపరిస్థితులన్నింటికీ సమంగా వర్తించే సార్వత్రిక సత్యం. అందుకే వైరుధ్యానికి యీ సాధారణ స్వభావం, యీ అఖండత వుండడం. అయితే ఈ సాధారణ స్వభావం ప్రతి వ్యక్తిగత(విడి) స్వభావంలోనూ యిమిడి వుంటుంది. వ్యక్తిగత(విడి) స్వభావం లేకుండా సాధారణ స్వభావమే వుండజాలదు. ఎందుకంటే వ్యక్తిగత(విడి) స్వభావాలన్నీ తొలగించివేస్తే, యిక సాధారణ స్వభావం ఏది మిగిలివుంటుంది? ప్రతి వైరుధ్యమూ ప్రత్యేకంగా వుండడంవల్లే ఈ వ్యక్తిగత (విడి)స్వభావం జనిస్తున్నది. వ్యక్తిగత(విడి) స్వభావాలన్నీకూడ షరాపూర్వకం గానూ (conditional), తాత్కాలికంగానూమాత్రమే మనివుంటాయి; కనుక, వ్యక్తిగత (విడి) స్వభావం సాపేక్షమైనదిమాత్రమే.

సాధారణ, వ్యష్టి (విడి) స్వభావాలనుగురించిన, సాపేక్షత, నిరపేక్షతలను గురించిన, సత్యం వస్తువుల్లోని వైరుధ్య సమస్యలోని అంతస్సారం. దాన్ని అర్థం చేసుకో విఫలమవడమంటే అది గతితర్కాన్ని గాలికి వదిలివేయడంతో సమమేనని గ్రహించాలి.

## 4. ప్రధాన వైరుధ్యం, వైరుధ్యపు ప్రధాన పక్షం

వైరుధ్యపు ప్రత్యేకత సమస్యకుసంబంధించి ముఖ్యంగా విశ్లేషించాల్సిన అంశాలు యింకా రెండున్నాయి. అవే - ప్రధాన వైరుధ్యం, వైరుధ్యపు ప్రధాన పక్షం.

ఒక సంక్లిష్ట వస్తువు లేక విషయం అభివృద్ధిచెందే క్రమంలో అనేక వైరుధ్యాలు వుంటాయి. వాటిలో ఒకటి అవశ్యం ప్రధాన వైరుధ్యంగా వుంటుంది. దాని ఉనికి, అభివృద్ధులే యితర వైరుధ్యాల ఉనికి, అభివృద్ధులను నిర్ణయిస్తుంటాయి లేదా ప్రభావితం చేస్తుంటాయి.

ఉదాహరణకు, పెట్టుబడిదారీ సమాజంలో వైరుధ్యంలోవుండే రెండు శక్తులు, కార్మిక వర్గం, బూర్జువా వర్గాలే, ప్రధాన వైరుధ్యాన్ని ఏర్పరుస్తాయి. ఇతర వైరుధ్యాలు - యింకా మిగిలివున్న భూస్వామ్యవర్గానికీ(ఫ్యూడల్ వర్గ అవశేషానికీ), బూర్జువా వర్గానికీ నడుమ వైరుధ్యం, రైతాంగ పెటీ బూర్జువావర్గానికీ, బూర్జువా వర్గానికీ నడుమ వైరుధ్యం, కార్మిక వర్గానికీ,

రైతాంగ పెటీ బూర్జువావర్గానికీ మధ్య వైరుధ్యం, గుత్తేతర పెట్టుబడిదారులకు, గుత్త పెట్టుబడిదారులకు మధ్య వైరుధ్యం, బూర్జువా ప్రజాస్వామ్యానికీ, బూర్జువా ఫాసిజానికీ నడుమ వైరుధ్యం, పెట్టుబడిదారీ దేశాల లోనే వుండే పరస్పర వైరుధ్యాలు, సామ్రాజ్యవాదానికీ, వలసలకూ మధ్య వైరుధ్యం వగైరా వైరుధ్యాలు - అన్నీకూడ ఈ ప్రధాన వైరుధ్యంచేతనే నిర్ణీతమౌతాయి లేదా ప్రభావితమౌతాయి.

చైనాలాంటి అర్ధవలస దేశంలో, ప్రధాన వైరుధ్యానికీ, అప్రధాన వైరుధ్యాలకూ మధ్య సంబంధం చాల సంక్లిష్టంగా వుంటుంది.

ఇలాంటి దేశంపై సామ్రాజ్యవాదం ఒక దురాక్రమణ యుద్ధాన్ని ప్రారంభించినప్పుడు, ఎవరైనా కొంతమంది ద్రోహులు తప్పితే, ఆ దేశంలోని వివిధ వర్గాల వారంతా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక జాతీయ యుద్ధం సాగించడానికి గాను తాత్కాలికంగా ఐక్యం కాగల్గుతారు. అలాంటి సమయంలో, సామ్రాజ్యవాదానికీ, దాని దురాక్రమణకు గురౌతూందని మనం చెప్పుకున్న దేశానికీ మధ్యగల వైరుధ్యం ప్రధాన వైరుధ్యం అవుతుంది. కాగా, ఆ దేశంలోని వివిధ వర్గాల నడుమవుండే వైరుధ్యాలన్నీ (అంతదాకా ప్రధాన వైరుధ్యంగా వుండినటువంటి భూస్వామ్యవ్యవస్థకూ, అశేష ప్రజానీకానికీ మధ్యగల వైరుధ్యంతో యుక్తంగా) ఒక రెండవ శ్రేణి, అధీన స్థితికి తాత్కాలికంగా నెట్టివేయబడతాయి. చైనాలో 1840 నాటి నల్లమందు యుద్ధం[23]

---

[23] 18వ శతాబ్దపు ఆఖరునుండి మొదలుపెట్టుకుని తర్వాత అనేక దశాబ్దాలుగా బ్రిటన్ నల్లమందును అంతకంతకూ అధిక మొత్తాలలో ఎగుమతి చేయసాగింది. ఈ వర్తకం చైనా ప్రజలను మందులమత్తులో ముంచెత్తడమేగాక, చైనాదేశ వెండి నిల్వలనుకూడ బాగా తరగదీసింది. పర్యవసానంగా ఈ నల్లమందు వ్యాపారం చైనాలో అతితీవ్ర వ్యతిరేకతను కలగజేసింది. 1840 లో, చైనాతో తన వ్యాపారాన్ని సంరక్షించుకునే నెపంతో బ్రిటన్ చైనాపై సాయుధ దురాక్రమణ ప్రారంభించింది. లిన్ సే సూ నాయకత్వంలో చైనా సైన్యాలు తీవ్ర ప్రతిఘటన సమర్పించాయి. కాంటన్‌లో ప్రజలు తమంత తాము అయత్నపూర్వకంగా "*బ్రిటిష్ సైనికుల్ని సంహరించండి!*" అనే వుద్యమం జోరుగా నడిపారు. దానితో బ్రిటిష్ దురాక్రమణ సైన్యాలు చావుదెబ్బలు తిన్నాయి. అయితే అవినీతికర చింగ్ ప్రభుత్వం 1842లో బ్రిటిష్ దురాక్రమణదారులతో నాంకింగ్ సంధి కుదుర్చుకున్నది. ఈ సంధిద్వారా బ్రిటన్‌కు నష్టపరిహారం చెల్లించడానికి, హాంగ్‌కాంగ్‌ను ధారాదత్తంచేయడానికి ఒప్పుకున్నారు. ఇంకా షాంఘై, ఫూచౌ, ఆమోయ్, నింగ్‌పో, కాంటన్ నగరాల్లోకూడ బ్రిటిష్ వ్యాపారాన్ని అనుమతించాలని, చైనాకు దిగుమతి చేసుకునే బ్రిటిషు సరుకులకు సుంకాలు బ్రిటన్, చైనాలు సంయుక్తంగా నిర్ధారించాలనికూడ ఈ సంధి నిర్దేశించింది.

కాలంలోనూ, 1894వ సంవత్సరపు చైనా-జపాన్ యుద్ధ మప్పుడూనూ,[24] తర్వాత 1900 వ సంవత్సరపు ఈ హో టువాన్[25] యుద్ధకాలంలోనూ అలాగే వుండింది. మరి ప్రస్తుతపు చైనా-జపాన్ యుద్ధ కాలంలోనూ పరిస్థితి అలాగే వున్నది.

అయితే మరొక పరిస్థితిలో, వైరుధ్యాలు తమ స్థితులు మార్చుకుంటాయి. యుద్ధంద్వారాకాక మరింత మెతక మార్గాలద్వారా - రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక మాధ్యమాలద్వారా - సామ్రాజ్యవాదం తన పీడన కొనసాగించేటప్పుడు అర్ధవలస దేశాల్లోని పాలకవర్గాలు సామ్రాజ్యవాదానికి లొంగిపోయి, ప్రజానీకాన్ని సంయుక్తంగా దోపిడీ, పీడనలకు లోనుచేసేందుకుగాను వారితో పొత్తుపెట్టుకుంటారు. అలాంటి సందర్భంలో ప్రజలు తరచూ సామ్రాజ్యవాదం, భూస్వామ్యవర్గాల పొత్తును ఎదిరిస్తూ అంతర్యుద్ధానికి తలపడుతుంటారు. అలాంటప్పుడు ప్రజలను పీడించడం, అణచివేయడాలలో అర్ధవలస దేశాల్లోని అభివృద్ధినిరోధకులకు సహాయం చేసేందుకు సామ్రాజ్యవాదం తరచూ ప్రత్యక్ష కార్యాచరణపైకంటే పరోక్ష పద్ధతులను ప్రయోగించడానికే అధిక ప్రాధాన్యత నిస్తూంటుంది. కనుక అలాంటి సందర్భాల్లో అంతర్గత వైరుధ్యాలు మరీ పదునుగా రూపొందుతాయి.

---

24 కొరియా, చైనాలను ఆక్రమించుకునే దురుద్దేశ్యంతో జపాన్ సామ్రాజ్యవాదులు 1894 నాటి చైనా-జపాన్ యుద్ధాన్ని ప్రారంభించారు. అనేకమంది చైనా సైనికులు, కొంతమంది దేశభక్తులైన సైన్యాధిపతులుకూడ, వారి నెదిరించి వీరోచితంగా పోరాటం చేశారు. కాని చింగ్ ప్రభుత్వపు అవినీతిమూలంగానూ, సరైన ప్రతిఘటనకు ఆ ప్రభుత్వం సన్నాహాలు చేయకపోవడంవల్లనూ చైనా ఓటమి పాలైంది. 1895లో చింగ్ ప్రభుత్వం జపాన్‌తో అవమానకరమైన షిమొనోసెకీ సంధి కుదుర్చుకున్నది.

25 "బాక్సర్ల తిరుగుబాటు" గా చరిత్రప్రసిద్ధమైన యీ ఈ హో టువాన్ వుద్యమం ఉత్తర చైనాలో 1900వ సంవత్సరంలో సంభవించిన ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధ పోరాటం. షాంటుంగ్ రాష్ట్రంలో 19వ శతాబ్దాంతానికల్లా క్రియాశీలంగా పనిచేయసాగిన ఈ హో టువాన్ ( న్యాయం, సామరస్యాల సంఘం), ట్సావో ఫూ టియన్, చాంగ్ టే చెంగ్‌లవంటి సమర్థులైన వీరుల నాయకత్వంలో సాగించిన మహత్తర సామ్రాజ్యవాదవ్యతిరేక తిరుగుబాటిది. రైతులు, చేతివృత్తి దారులు, తదితర జనవర్గాలకు చెందిన విశాల ప్రజానీకం ఈ వుద్యమంలో పాల్గొన్నారు. మతపర మార్గాలద్వారానూ, యితరేతర మార్గాల్లోనూ ఒకరితో ఒకరు సంపర్కం పెట్టుకుంటూ, ఈ ప్రజలంతా రహస్య సంఘాల ప్రాతిపదికపై తమ్మి తాము ఆర్గనైజు చేసుకుంటూ, మొత్తం ఎనిమిది సామ్రాజ్యవాద శక్తుల - అమెరికా, బ్రిటన్, జపాన్, జర్మనీ, రష్యా, ఫ్రాన్సు, ఇటలీ, ఆస్ట్రియా దేశాల సంయుక్త దురాక్రమణ బలగాలకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం చేసారు. అయితే [వారు ఓడిపోయి] సంయుక్త దురాక్రమణ సైన్యాలు టీన్ స్టీన్, పెకింగ్(బీజింగ్)లను ఆక్రమించుకున్న తర్వాత ఈ ఉద్యమం అత్యంత కిరాతకంగా అణచివేయబడింది.

1911 విప్లవ యుద్ధమప్పుడు, 1924-27 విప్లవకర యుద్ధకాలంలో, ఆనక 1927 తర్వాత సాగిన 10 సంవత్సరాల వ్యవసాయ విప్లవ యుద్ధమప్పుడు జరిగిందిదే. అలాగే అర్ధవలస దేశాల్లోని వివిధ అభివృద్ధినిరోధక పాలకవర్గ ముఠాలనడుమ జరిగే యుద్ధాలు, ఉదాహరణకు, చైనాలో యుద్ధప్రభువులనడుమ జరిగిన యుద్ధాలు, కూడ ఈ కోవకే చెందుతాయి.

విప్లవ అంతర్యుద్ధం సామ్రాజ్యవాదుల, దాని కావలికుక్కలైన స్వదేశీ అభివృద్ధి నిరోధకుల అస్తిత్వాన్నే ప్రమాదంలో పడవేసే స్థాయికి అభివృద్ధిచెందినప్పుడు, సామ్రాజ్యవాదం తరచూ తన పాలన అట్టిపెట్టుకుని సాగించడానికిగాను యితరేతర పద్ధతులు అవలంబిస్తుంది. అది ఒకటా విప్లవ సంఘటనను లోనుండి చీల్చడానికి ప్రయత్నిస్తుంది, లేదా స్వదేశీ అభివృద్ధినిరోధకులకు ప్రత్యక్షంగా సాయపడడానికి సైన్యాలు పంపిస్తుందికూడ. అలాంటి సమయంలో విదేశీ సామ్రాజ్యవాదులు, స్వదేశీ అభివృద్ధినిరోధకులు పూర్తిగా బాహాటంగా ఒక ధ్రువాన, అశేష ప్రజానీకం వారికి వ్యతిరేకంగా మరో ధ్రువాన నిలబడుతారు; ఈ విధంగా, యితర వైరుధ్యాలన్నింటి అభివృద్ధినీ నిర్ణయించే లేక ప్రభావితం చేసే ప్రధాన వైరుధ్యాన్ని ఏర్పరుస్తారు. అక్టోబరు విప్లవం తర్వాత రష్యన్ అభివృద్ధినిరోధకులకు వివిధ పెట్టుబడిదారీ దేశాలు అందజేసిన సహాయం యిలాంటి సాయుధ జోక్యానికి ఒక ఉదాహరణ. పోతే 1927లో చియాంగ్ కై షేక్ చేసిన విద్రోహం విప్లవ సంఘటనను (సామ్రాజ్యవాదులు) లోనుండి చీల్చడానికి ఒక మచ్చుతునక.

అయితే ఏం జరిగినాగానీ, ఒక క్రమం అభివృద్ధికిచెందిన ప్రతి దశలోనూ నాయకత్వ పాత్ర వహించే ప్రధాన వైరుధ్యం ఒక్కటే వుంటుందనే దాంట్లో ఏ సందేహమూ లేదు.

కనుక ఏదైనా క్రమంలో అనేక వైరుధ్యాలున్నప్పుడు, వాటిలో ఏదో ఒక్కటి ప్రధాన వైరుధ్యమై నాయకత్వ, నిర్ణయాత్మక పాత్రను వహిస్తూనూ, మిగతావి దానికి రెండవ, అధీన స్థితిలోనూ వుంటాయి. అందుచేత, రెండు లేక అంతకు ఎక్కువ వైరుధ్యాలుండే ఏ సంక్లిష్ట క్రమాన్నైనా అధ్యయనం చేసేటప్పుడు మనం దాని ప్రధాన వైరుధ్యాన్ని కనుక్కోవడానికి సర్వప్రయత్నాలూ చేయాలి. ఒక సారి ఈ ప్రధాన వైరుధ్యాన్ని గనుక పట్టుకుంటే, ఆనక యితర సమస్యలన్నిటినీ పరిష్కరించడం సాధ్య పడుతుంది. పెట్టుబడిదారీ సమాజాన్ని తాను

అధ్యయనం చేసేటప్పుడు మార్క్స్ ఉపయోగించి, మనకు బోధించిన పద్ధతి యిదే. అదేవిధంగా సామ్రాజ్యవాదాన్ని, పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభాన్ని తాము అధ్యయనం చేసినప్పుడు, యింకా సోవియట్ ఆర్థిక విధానాన్ని పరిశీలించేటప్పుడు సైతం, లెనిన్, స్టాలిన్‌లు ఉపయోగించి, మనకు బోధించిన పద్ధతికూడ యిదే. కాని ఈ అంశాన్ని అర్థం చేసుకోని మేధావులు, కార్యశూరులు వేలాదిమంది వున్నారు. పర్యవసానంగా వాళ్లంతా ఒకవిధంగా "పొగమంచు"లో చిక్కుకుని దారితప్పిపోతుంటారు; అంటే సమస్య గుండెకాయను పట్టుకోలేక, సహజంగానే దాన్ని పరిష్కరించే మార్గం కనుక్కోలేక సతమతమౌతుంటారు.

మనం యిప్పుడే చెప్పుకున్నట్లు, ఒక క్రమంలోని వైరుధ్యాలన్నీ సమప్రాధాన్యం గలవిగా మనం చూడరాదు; కాగా వాటిలో ప్రధాన, ద్వితీయ వైరుధ్యాలను వేరుచేసి చూచి, ప్రధాన వైరుధ్యాన్ని పట్టుకోవడంపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు వహించాలి. అయితే ఏదైనా ఒక వైరుధ్యంలోని - అది ప్రధాన వైరుధ్యమేకానీ లేక అప్రధానమైనదే కానీ - రెండు విరుద్ధ పక్షాలనూ అయితే సమంగా చూచి వ్యవహరించవచ్చా? దీనికి జవాబుకూడ - కాదు, కూడదు అనే. ఏ వైరుధ్యంలోనైనా విరుద్ధ పక్షాల వికాసం అసమంగా వుంటుంది. కొన్నిసార్లు అవి సమస్థితిలో వున్నట్లు అగుపిస్తుందికాని, అదంతా తాత్కాలికం, సాపేక్షంమాత్రమేనని, కాగా అసమాభివృద్ధే ప్రాథమికం అని గమనించాలి. ఒక వైరుధ్యంలోనే వుండే ఈ రెండు విరుద్ధ పక్షాల్లోనూ ఒకటి ప్రధాన పక్షంకాగా, మరొకటి రెండవ (ప్రాముఖ్యత గల)దిగా వుంటుందని తెలుసుకోవాలి. వైరుధ్యంలో నాయకత్వ పాత్ర వహించేది ఈ ప్రధాన పక్షమే. ఒక వస్తువు లేక విషయం నిజస్వభావం ప్రధానంగా దాని వైరుధ్యపు ప్రధాన పక్షంచే, అంటే ఆధిపత్య స్థితి గడించివున్న పక్షంచే నిర్ణీతమౌతుంది.

అయితే ఈ పరిస్థితేమీ జడంగా, మార్పులేకుండా వుండదు. ఒక వైరుధ్యంలోని ప్రధాన, అప్రధాన పక్షాలు ఒకటి మరొకటిగా మారడంకూడ సంభవిస్తూంటుంది. ఫలితంగా వస్తువుల స్వభావంకూడ తదనుగుణంగానే మారుతూంటుంది. ఒక నిశ్చిత ప్రక్రియలో, ఒక వైరుధ్యపు ఏదైనా నిశ్చిత అభివృద్ధి దశలో ప్రధాన పక్షం A అనీ, అప్రధాన పక్షం B అనీ అనుకుందాం. అయితే మరొక దశలో లేదా మరొక క్రమంలో ఈ వైరుధ్యపక్షాల పాత్రలు

తారుమారు కావచ్చు, అంటే B ప్రధాన పక్షమై, A అప్రధాన పక్షంగా మారిపోవచ్చు. వస్తువు అభివృద్ధి క్రమంలో దాని వైరుధ్యంలోని విరుద్ధ పక్షాలు జరుపుకునే పరస్పర పోరాటంలో వాటి బలాబలాల హెచ్చు, తగ్గులపై ఆధారపడి యిలాంటి మార్పు సంభవిస్తూంటుంది.

"కొత్త, పాతను అధిగమిస్తుంది," అని మనం తరచూ అంటుంటాము. పాతను కొత్త అధిగమించడమనేది ఈ విశ్వంలోని ఒక సాధారణమైన, శాశ్వతమైన (అజరామరమైన), అనుల్లంఘనీయమైన సూత్రమని తెలుసుకోవాలి. వస్తువు అంతస్సారాన్నిబట్టీ, యింకా బాహ్య పరిస్థితులనుబట్టికూడ, తదనుగుణమైన వివిధ రకాల *గంతుల* ద్వారా ఆ వస్తువు మరొకదానిగా మారడం - పాతను కొత్త అధిగమించే క్రమం యిదే నని గ్రహించాలి. ప్రతి వస్తువులోనూ దాని పాత, కొత్త పక్షాల(లక్షణాల) మధ్య వైరుధ్యం వుంటుంది; యిది అనేక తిరుగుళ్లతో కూడుకున్నఒక పోరాటాల పరంపరకు దారి తీస్తుంది. ఈ పోరాటాల ఫలితంగా కొత్త పక్షం(లక్షణం) అల్పాంశం(మైనరు)గా వున్నదల్లా క్రమంగా అధికాంశం(మేజరు)గా మారి, ఆధిపత్య స్థితిని సాధిస్తుంది. కాగా పాత పక్షం అధికాంశంగావున్నదల్లా అల్పాంశంగా మారి, క్రమేపీ అంతరించిపోతుంది. ఇక కొత్త పక్షం పాతదానిపై ఆధిపత్యాన్ని గడించిన మరు క్షణమే పాత వస్తువు గుణాత్మకంగా మారి కొత్త వస్తువుగా రూపుదాలుస్తుంది. కనుక ఒక వస్తువు అసలు స్వభావం ముఖ్యంగా దాని వైరుధ్యపు ప్రధాన పక్షంచేత - ఆధిపత్య స్థితిని సాధించిన పక్షంచేత - నిర్ణయింపబడుతుందని గమనించగలం. ఆధిపత్యం సాధించిన ప్రధాన పక్షం మారినప్పుడు, ఆ వస్తువు స్వభావంకూడ తదనుగుణంగా మారిపోతుంది.

పెట్టుబడిదారీ సమాజంలో, అంతదాకా పాత ఫ్యూడల్ యుగంలో ఒక అధీన (subordinate) శక్తిగా వుండిన పెట్టుబడిదారీ విధానం ఆ స్థితినుండి మారి, ఒక ఆధిపత్య శక్తిగా పరిణమించడంతో సమాజస్వభావంకూడ భూస్వామ్యస్వభావం నుండి పెట్టుబడిదారీ స్వభావంగా మారింది. కొత్త, పెట్టుబడిదారీ శకంలో, ఫ్యూడల్ శక్తులు తమ పూర్వపు ఆధిపత్య స్థితినుండి ఒక అదీన స్థితికి పతనమై క్రమేపీ అంతరించి పోయాయి. ఉదాహరణకు, బ్రిటన్, ఫ్రాన్సులలో యిలాగే జరిగింది. పోతే ఉత్పత్తి శక్తులు మరింతగా అభివృద్ధి చెందేకొద్దీ, బూర్జువావర్గంకూడ ఒక ప్రగతి శీల పాత్ర వహించే నూతన వర్గం

స్థితినుండి మారి, క్రమేపీ ఒక అభివృద్ధినిరోధక పాత్ర నిర్వర్తించే పాత వర్గంగా రూపొందుతుంది; చివరకు కార్మికవర్గంచే కూలద్రోయ బడి, తన ప్రైవేటు యాజమాన్యంలోని ఉత్పత్తి సాధనాలను కోల్పోయి, రాజ్యాధికారంకూడ పోగొట్టుకుని, ఆనక అదికూడ క్రమక్రమంగా పూర్తిగా అంతరించిపోతుంది. సంఖ్యాపరంగా బూర్జువావర్గంకంటె ఎంతో అధికంగావుంటూ, బూర్జువావర్గంతోబాటుగానే అయితే దాని పాలనకింద, ఏకకాలంలో, పెరుగుతూవచ్చే, కార్మికవర్గం ఒక నూతన శక్తి. అది మొదట్లో బూర్జువావర్గానికి అధీనమైవున్నా, మెల్ల మెల్లగా బలం పుంజుకుంటూ, చరిత్రలో నాయకత్వ పాత్ర వహించే ఒక స్వతంత్ర వర్గంగా రూపొందుతుంది. అంతిమంగా అది రాజ్యాధికారం కైవసం చేసుకుని, పాలక వర్గమవుతుంది. దానితో సమాజ స్వభావం మారుతుంది; పాత పెట్టుబడిదారీ సమాజం, కొత్త సోషలిస్టు సమాజంగా రూపొందుతుంది. సోవియట్ యూనియన్ యిప్పటికే తీసుకున్న మార్గం యిదే. తక్కిన దేశాలన్నీకూడ అనివార్యంగా చేపట్టబోయే మార్గమూ యిదే.

ఉదాహరణకు, చైనా విషయమే పరిశీలిద్దాం. చైనా ఒక అర్ధవలసగా మార్చి వేయబడ్డ వైరుధ్యంలో సామ్రాజ్యవాదం ప్రధాన స్థితిని ఆక్రమించివుంది. అది చైనా ప్రజలను అణచివేస్తూంది. స్వతంత్ర దేశంగావున్న చైనా అందుమూలంగా ఒక అర్ధవలస దేశంగా మారిపోయింది. కాని ఈ పరిస్థితులు అనివార్యంగా మారుతాయి. రెండు పక్షాలమధ్య సాగే పోరాటంలో, కార్మికవర్గ నాయకత్వంకింద పెరుగుతూ వస్తున్న చైనా ప్రజల శక్తియుక్తులు చైనాను అర్ధవలస స్థితినుండి ఒక స్వతంత్ర దేశంగా మార్చడం తథ్యం, అనివార్యం. కాగా సామ్రాజ్యవాదం కూలద్రోసివేయబడి, పాత చైనా అనివార్యంగా కొత్త చైనాగా మార్పు చెందుతుంది.

పాత చైనా కొత్త చైనాగా మార్పు చెందడమంటే, దేశంలోని పాత భూస్వామ్య శక్తులకు, కొత్త ప్రజాశక్తులకు మధ్య సంబంధంలోకూడ మార్పు వస్తుందనే. పాత ఫ్యూడల్ భూస్వామ్య వర్గం కూలద్రోయబడి, పాలకవర్గంగా వున్నదల్లా ఒక పాలిత వర్గంగా మారిపోతుంది; క్రమేపీ యీ వర్గం పూర్తిగా అంతరించిపోతుందికూడ. పోతే, పాలితులుగావున్న ప్రజలు, కార్మిక వర్గ నాయకత్వంలో, పాలకులవుతారు. దానితో చైనా సమాజ స్వభావం

మారిపోతుంది. పాత, అర్ధ వలస, అర్ధ భూస్వామ్య సమాజం ఒక నూతన ప్రజాస్వామిక సమాజంగా మారుతుంది.

ఇలాంటి తారుమారు మార్పులకు ఉదాహరణలు మనకు గతానుభవంలో లభిస్తాయికూడ. చైనాను యించుమించు మూడు వందల ఏళ్లు పరిపాలించిన చింగ్ రాజవంశాన్ని 1911 విప్లవం కూలద్రోసింది. సన్ యట్ సేన్ నాయకత్వంకింద విప్లవకర టుంగ్ మెంగ్ హుయ్ తాత్కాలికంగా విజయం సాధించింది. 1924-27 విప్లవ యుద్ధంలో, దక్షిణాదిలోని కమ్యూనిస్టు-కొమింటాంగ్ సంఘటనకు చెందిన విప్లవ బలగాలు మొదట్లో బలహీనంగావున్నవల్లా కాలక్రమాన బలవత్తరంగా రూపొంది ఉత్తరదేశ దండయాత్రలో విజయం సాధించాయి. కాగా ఒకప్పుడు పాలకులై చక్రం తిప్పిన ఉత్తరాది యుద్ధప్రభువులు కూలద్రోయబడ్డారు. 1927లో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని ప్రజా సైనికబలగాలు- కొమింటాంగ్ అభివృద్ధినిరోధకుల దెబ్బల తాకిడికి బాగా బలహీనపడి, సంఖ్యాపరంగా బాగా తగ్గిపోయాయి. కాని తమ శ్రేణుల్లోని అవకాశవాదాన్ని పారవేయడంతో అవి మళ్లీ క్రమక్రమంగా పెరుగుతూ వచ్చాయి. కమ్యూనిస్టుల నాయకత్వంలోని విప్లవ స్థావర ప్రాంతాల్లో యిదివరకు పాలితులుగా మగ్గుతుండిన రైతులు యిప్పుడు పాలకులుగా మారిపోయారు. కాగా భూస్వాములు యిందుకు వ్యతిరేక మార్పుకు గురయ్యారు. ప్రపంచ గతి ఎప్పుడూ యింతే - కొత్త, పాతను తోసేస్తూంటుంది; పాత, కొత్తచేత అధిగమించ బడుతూంటుంది. కొత్తకు దారి చేయడానికిగాను పాత నిర్మూలించబడుతూ వుంటుంది; ఆ పాతనుండే కొత్త ఆవిర్భవిస్తూంటుంది.

విప్లవ పోరాటంలో కొన్ని కొన్ని సందర్భాల్లో, కష్టనష్టాల పరిస్థితులు సానుకూల పరిస్థితులకంటె ప్రబలంగా వుంటాయి. కనుక వైరుధ్యంలో ప్రధాన పక్షం వాటిదే అయివుంటుంది; కాగా,సానుకూల పరిస్థితులు రెండవ,అప్రధాన పక్షంగా వుంటాయి. అయితే విప్లవకారులు తమ ప్రయత్నాలద్వారా విప్లవకారులు మెట్టు మెట్టుగా కష్టాలు గట్టెక్కి తమకు సానుకూల పరిస్థితిని సృష్టించుకోగల్గుతారు. ఈ విధంగా కష్టస్థితి గడిచి అనుకూల స్థితి ఏర్పడుతుంది. చైనాలో 1927లో విప్లవ వైఫల్యం తర్వాత, అలాగే చైనా ఎర్ర సైన్యం దీర్ఘ యాత్ర (లాంగ్ మార్చ్) అప్పుడూ జరిగిందిదే. ప్రస్తుతపు చైనా - జపాన్ యుద్ధకాలంలో చైనా మళ్లీ కష్ట స్థితిలో చిక్కుకుని వుంది. అయితే మనం

దీన్నికూడ మార్చవచ్చు; చైనా, జపాన్‌లమధ్య నేడు నెలకొనివున్న పరిస్థితిలో మౌలిక పరివర్తన తీసుకురావచ్చు. ఇందుకు విపర్యయంగా, విప్లవకారులు తప్పులు చేస్తే సానుకూల పరిస్థితులుసైతం కష్ట స్థితిగా మారిపోవచ్చు. ఈ విధంగానే 1924-27 విప్లవం పరాజయం పాలైంది. 1927 తర్వాత దక్షిణాది రాష్ట్రాలలో పెంపొందిన విప్లవ స్థావర ప్రాంతాలు అన్నీ 1934 నాటికి ఓటమికి లోనుకావడం కూడ యీ కారణంగానే.

మనం ఏ విషయమైనా అధ్యయనం చేసేటప్పుడు, అజ్ఞానంనుండి జ్ఞానానికి మన గమనంలో వర్తించేదికూడ యిదే. మనం మార్క్సిజాన్ని అధ్యయనం చేసేటప్పుడు మొట్టమొదట్లగా మార్క్సిజంగురించి మన అజ్ఞానం లేక అల్పజ్ఞానం, మార్క్సిజంగురించిన (ఉండవల్సిన సారభూత) జ్ఞానానికి ప్రతిగా వైరుధ్యంలో నిలిచివుంటుంది. కాని కఠిన అధ్యయనంద్వారా అజ్ఞానాన్ని జ్ఞానంగా, అల్పజ్ఞానాన్ని తగినంత(సారభూత) జ్ఞానంగా, మార్క్సిజాన్ని అన్వయించడంలో గుడ్డివర్తనను దాన్ని ప్రయోగించడంలో నైపుణ్యంగా మార్చుకోవచ్చు.

అయితే యిది కొన్ని కొన్ని వైరుధ్యాల విషయంలో సత్యం కాదని కొందరు అభిప్రాయపడుతుంటారు. ఉదాహరణకు, ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాల మధ్యగల వైరుధ్యంలో ఉత్పత్తి శక్తులది ప్రధాన పక్షం; సిద్ధాంతానికి, ఆచరణకు నడుమవుండే వైరుధ్యంలో ఆచరణది ప్రధాన పక్షం; ఆర్థిక పునాదికీ, ఉపరినిర్మాణానికీ మధ్య వైరుధ్యంలో ఆర్థిక పునాదిది ప్రధాన పక్షం - వీటి ఉభయ పక్షాల స్థితిగతుల్లో మార్పులు ఉండజాలవంటారు. అయితే యిది యాంత్రిక భౌతికవాద వైఖరేగాని గతితార్కిక భౌతికవాద వైఖరి కాదని గమనించాలి. నిజమే, ఉత్పత్తి శక్తులు, ఆచరణ, ఆర్థిక పునాది సాధారణంగా ప్రధాన, నిర్ణాయక పాత్ర వహిస్తాయనేది యథార్థమే; దీన్ని నిరాకరించేవాళ్లు భౌతికవాదులు కాలేరుకూడ. కాని, కొన్ని సందర్భాల్లో ఉత్పత్తి సంబంధాలు, సిద్ధాంతం, ఉపరినిర్మాణాలవంటి (అప్రధాన) పక్షాలుసైతం తమవంతుకు ప్రధాన, నిర్ణాయక పాత్ర వహిస్తాయనికూడ గమనించాలి. ఉత్పత్తి సంబంధాలలో మార్పురానిదే ముందుకు అభివృద్ధిచెందడం ఉత్పత్తి శక్తులకు అసాధ్యమయ్యేటప్పుడు, ఉత్పత్తి సంబంధాలలో మార్పుకు ప్రధాన, నిర్ణయాత్మక పాత్ర వుంటుంది. "విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవోద్యమం

వుండజాలదు,"[26] అని లెనిన్ ఏ కాలాలను దృష్టిలోవుంచుకుని అన్నాడో అటువంటి కాలాల్లో విప్లవ సిద్ధాంతం సృష్టి, ప్రచారాలకు ప్రధాన, నిర్ణయాత్మక పాత్ర వుంటుందని తెలుసు కోవాలి. ఒక కర్తవ్యాన్ని, అదేమైనా కావచ్చుగాక, నిర్వర్తించాల్సి వున్నప్పుడు, కాని అందుకు సంబంధించి యింకా ఏ మార్గదర్శక సూత్రం, పద్ధతి, ప్రణాళిక లేక విధానం రచింపబడిలేనప్పుడు, ఆవశ్యకమైన మార్గదర్శక సూత్రం, పద్ధతి, ప్రణాళిక లేక విధానం రచనకు తలపడడమే ప్రధాన, నిర్ణయాత్మక అంశమవుతుంది. పైకట్టడం (రాజకీయాలు, సంస్కృతి, వగైరా) ఆర్థిక పునాది వికాసాన్ని అడ్డుకునేటప్పుడు, రాజకీయ, సాంస్కృతిక మార్పులు ప్రధానం, నిర్ణయాత్మకం అవుతాయి. ఇలా అంటే మనం భౌతికవాదానికి వ్యతిరేకంగా పోట్లాడుతున్నట్లా? కానే కాదు. కారణమేమంటే, చరిత్ర సాధారణ వికాసగతిలో భౌతిక విషయాలు మానసిక విషయాలను, సాంఘిక అస్తిత్వం సాంఘిక చైతన్యాన్ని నిర్ణయిస్తాయని మనం గుర్తించేటప్పుడు, అదే సమయంలో మానసిక విషయాలకు భౌతిక విషయాలపైన, సామాజిక చైతన్యానికి సామాజిక అస్తిత్వంపైన, ఉపరినిర్మాణానికి, ఆర్థిక పునాదిపైన వుండే ప్రతిక్రియల్నికూడ మనం గుర్తిస్తాము ; అలా తప్పక గుర్తించాల్సివుంటుంది కూడ. ఇదేమీ భౌతికవాదానికి వ్యతిరేకం కాదు. కాకపోగా యిందువల్ల యాంత్రిక భౌతికవాదం బారినుండి తప్పించుకుని, గతితార్కిక భౌతికవాదాన్ని దృఢంగా నిలబెట్టడం వీలవుతుందికూడ.

వైరుధ్యం ప్రత్యేకతను అధ్యయనం చేసేటప్పుడు మనం ఈ రెండు పట్టెల్ని (facets) - ఒక క్రమంలోని ప్రధాన,అప్రధాన వైరుధ్యాలను, ఒకే వైరుధ్యంలోని ప్రధాన, అప్రధాన పక్షాలను - పరిశీలిస్తే తప్ప, అంటే వైరుధ్యంలోని ఈ రెండు పట్టెల విశిష్ట స్వభావాన్ని పరిశీలిస్తే తప్ప, మనం ఏవో అనిర్దిష్టీకరణల్లో కూరుకుపోవడం జరుగుతుంది; వైరుధ్యాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేకపోతాము, పర్యవసానంగా దాని పరిష్కారానికి సరైన పద్ధతిని కనుగొనలేకపోతాము వైరుధ్యపు యీ రెండు పట్టెల విశిష్ట స్వభావం లేక ప్రత్యేకత, వైరుధ్యంలోవుండే శక్తుల అసమత్వాన్ని సూచిస్తుంది.

---

26 వి.ఐ. లెనిన్, *ఏం చేయాలి ?*, సేకరించిన రచనలు, ఇంగ్లీషు ప్రచురణ, మాస్కో, 1961, 5వ సంపుటం, పుట 369.

ఈ ప్రపంచంలో ఏదీకూడ పూర్తి సమంగా అభివృద్ధి చెందదు; సమాభివృద్ధి లేదా సమతౌల్య సిద్ధాంతాన్ని మనం వ్యతిరేకించాలి. పైపెచ్చు, వైరుధ్యపు ఈ నిర్దిష్ట లక్షణాలు, దాని అభివృద్ధిక్రమంలో వైరుధ్యపు ప్రధాన, అప్రధాన పక్షాల్లో కలిగే మార్పులే పాతను అధిగమించే కొత్త యొక్క శక్తిని అభివ్యక్తం చేస్తాయి. వైరుధ్యాలలో వుండే వివిధ అసమ స్థితుల్ని అధ్యయనం చేయడం, ప్రధాన, అప్రధాన వైరుధ్యాలను, వైరుధ్యంలోని ప్రధాన, అప్రధాన పక్షాలను పరిశీలించడం అనేది అత్యావశ్యక సారభూత పద్ధతి. దీనిద్వారానే ఒక విప్లవకర రాజకీయ పార్టీ దాని రాజకీయ, సైనిక వ్యవహారాలు రెంటిలోనూ వలసిన వ్యూహాత్మక, ఎత్తుగడల పంథాలను సరిగ్గా నిర్ణయించుకుంటుంది. కమ్యూనిస్టులందరూ ప్రత్యేకించి శ్రద్ధ వహించాల్సిన విషయమిది.

## 5. వైరుధ్యంలోని ఉభయ పక్షాలమధ్య అభిన్నత, పోరాటాలు

వైరుధ్యపు విశ్వజనీనతను, ప్రత్యేకతను అర్థంచేసుకున్నప్పుడు మనం యింకా ముందుకువెళ్లి వైరుధ్యపు ఉభయ పక్షాల మధ్య **అభిన్నత (identity)**, పోరాటాల **(struggle)** సమస్యను అధ్యయనం చేయాల్సి వుంటుంది.

అభిన్నత, ఐక్యత, ఏకీభావం (సంయోగం - **coincidence**), పరస్పర చొరబాటు, పరస్పర వ్యాప్తి, పరస్పరాధీనత (లేక పరస్పరాధారిత అస్తిత్వం), పరస్పర బంధం లేక పరస్పర సహకారం - ఈ వివిధ పదాలన్నింటి అర్థం ఒక్కటే; యివన్నీ దిగువ రెండు అంశాలను సూచిస్తాయి : 1. మొదటిదేమంటే, ఒక వస్తువు అభివృద్ధిక్రమంలోని వైరుధ్యపు రెండు పక్షాల్లో ఏదైనా మరొకదాని అస్తిత్వంవున్నప్పుడే మనివుంటుంది; ఈ రెండు పక్షాలు(లేక కోణాలు) ఒకే సత్వం**(entity)** లో సహజీవనం సాగిస్తాయి. 2. రెండవది, నిశ్చిత పరిస్థితుల్లో, ఈ రెండు విరుద్ధ పక్షాల్లో ప్రతిదీ దాని ఎదుటి పక్షంగా మారిపోతూంటుంది. అభిన్నతకు అర్థం యిదే.

లెనిన్ యిలా అంటాడు :

**విరుద్ధ అంశాలు (opposites) ఎలా అభిన్నంగా (identical) వుండ గలవు, అవి ఏ విధంగా అలా వుంటాయి (ఎలా అభిన్నంగా రూపొందుతాయి) - ఏ**

పరిస్థితుల్లో అవి పరస్పరం ఒకటి మరొకటిగా మారిపోతూ, అభిన్నంగా వుంటాయి -, మానవ మస్తిష్కం ఈ విరుద్ధాంశాలను జీవంలేని, అతికరినమైన అంశాలుగాకాక, పరస్పరం ఒకటి మరొకటిగా మారుతూండే, సజీవమైన, చలనశీలమైన, నిబంధనాబద్ధమైన అంశాలుగా ఎందుకు పరిగ్రహించాలో గతితర్కం మనకు బోధిస్తుంది.[27]

పై మాటలకు అర్థం ఏమిటి ?

ప్రతి క్రమంలోనూ వుండే విరుద్ధ పక్షాలు ఒకదాని కొకటి వేరుగా, పరస్పరం వ్యతిరేకంగా, పరస్పరం పోరాడుతూవుంటాయి. మినహాయింపు లేకుండా, ఈ విరుద్ధ పక్షాలు సమస్త వస్తువుల అభివృద్ధిక్రమంలోనూ, మానవ చింతన అంతటిలోనూ నెలకొనివుంటాయి. ఒక సులభసామాన్య క్రమంలోనైతే కేవలం ఒక్క విరుద్ధాంశాల జత మాత్రమే వుంటుంది; కాగా జటిలమైన క్రమాల్లో అనేక జతల విరుద్ధ పక్షాలు వుంటాయి. వాటివంతుకు, ఈ విరుద్ధాంశాల జతలుసైతం తమలో తాము మళ్లీ పరస్పర వైరుధ్యాల్లో వుంటాయి. భౌతిక ప్రపంచంలోని, సమస్త మానవ ఆలోచనల్లోని సకల వస్తు, విషయ జాలమూ ఏర్పడివుండేదీ, చలనంలోనికి తీసుకురాబడేదీ ఈ విధంగానే నని గ్రహించాలి.

మరి యథార్థత యిలా వుందంటే, అభిన్నత లేక ఐక్యత బొత్తిగా లేదు అనే స్పష్టమవుతున్నదిగదా, మరి మనం అభిన్నత లేక ఐక్యత గురించి ఎలా మాట్లాడ గలమంటారు ?

వాస్తవమేమంటే, విరుద్ధ పక్షం ఏదైనాకూడ ఒంటరి బతుకు సాగించలేదు. దాని విరుద్ధ పక్షంగనుక లేకపోతే ఈ పక్షాల్లో ప్రతిదానికీ మనుగడకు వలసిన స్థితే లేకుండాపోతుంది. కొద్దిగా ఆలోచించి చూడండి - వస్తువుయొక్క లేక మనిషి మెదడులో ఏర్పడిన భావనయొక్క విరుద్ధ పక్షాల్లో ఏ ఒక్కటైనా స్వతంత్రంగా మనివుండగలదేమో యోచించండి. జీవితం లేకుండా

---

[27] హెగెల్ రాసిన "తర్క శాస్త్రం",సంపుటి 1, సెక్షను 1 లోని "నిర్ధారకతత్వం (గుణధర్మం - quality)" అనే విషయంపై లెనిన్ రాసుకున్న వివరణలనుండి. చూడు : వి.ఐ.లెనిన్, 'హెగెల్ తర్క శాస్త్రం పై సమగ్ర దృష్టి', సేకరించిన రచనలు (Collected Works), రష్యన్ ప్రచురణ, మాస్కో , 1958, సంపుటి XXXVIII, పుటలు 97-98.

మరణం అంటూ వుండదు; అలాగే చావు లేని బతుకు లేదు. పైన అనేది లేకుండా కింద అనేది వుండదు; కింద అనేది లేకపోతే పైన అనేదెలా వుంటుంది? దుర్భాగ్యం లేకుండా సౌభాగ్యం వుండదు; అలాగే అదృష్టం లేకుండా దురదృష్టమూ వుండదు. సౌకర్యం లేకుండా అసౌకర్యం, అసౌకర్యం లేకుండా సౌకర్యం వుంటాయా? భూస్వాములు లేకుండా కౌలుదారు రైతులు వుండరు; కౌలుదారు రైతులు లేకుంటే భూస్వాములు మాత్రం ఎలా వుంటారు? బూర్జువా వర్గం లేకుండా కార్మిక వర్గం ఉండలేదు; కార్మిక వర్గం లేనిదే బూర్జువా వర్గమూ వుండలేదు. సామ్రాజ్యవాదంచే జాతుల అణచివేత లేనిదే వలసలు, అర్ధ వలసలు వుండవు; వలసలు, అర్ధ వలసలు లేకుంటే జాతులపై సామ్రాజ్యవాదుల అణచివేత కూడ వుండదు. ఇలా, యిలా సమస్త విరుద్ధ పక్షాల సంగతీ యిలాగే వుంటుంది. నిశ్చిత పరిస్థితుల్లో ఒక వైపున అవి పరస్పరం ఒకదాన్నొకటి ఎదిరిస్తూ వుంటాయి; మరో వైపున అవి పరస్పర సంబంధితంగా, పరస్పర చొరబాటుతో, పరస్పర వ్యాప్తితో, పరస్పరాధారితంగా వుంటాయి - ఈ స్వభావాన్నే అభిన్నత (identity) అంటారు. నిశ్చిత పరిస్థితుల్లో, విరుద్ధ పక్షాలన్నీ అభిన్నతారహిత స్వభావం (character of non-identity) కలిగివుంటాయి; కనుక అవి పరస్పరం వైరుధ్యంలో వున్నాయని అభివర్ణిస్తుంటారు. కాని వాటికి అభిన్నతా స్వభావంకూడ వుంటుంది; కనుక అవి పరస్పర సంబంధితంగా వుంటాయి. కనుక గతితర్కం "విరుద్ధాంశాలు .... అభిన్నంగా ఎలా వుండగలవో " నన్నే విషయం అధ్యయనం చేస్తుందని అనేటప్పుడు లెనిన్ సూచించే అంతరార్థం యిదే నని తెలుసు కోవాలి. అవి అభిన్నంగా ఎలా వుండగలవు? ఎందుకంటే ప్రతిదీ యింకోదాని మనుగడకు వలసిన షరాస్థితిగా వుంటుందిగనుక. అభిన్నతయొక్క మొదటి అర్థం యిదే.

అయితే విరుద్ధ పక్షాల్లో ప్రతిదీ మరొకదాని మనుగడకు అవసరమైన నిబంధనాస్థితి, వాటిమధ్య అభిన్నత వుంది, పర్యవసానంగా అవి రెండూ ఒకే సత్వంలో సహజీవనం సాగించగల్గుతాయి అన్నంతమాత్రాన సరిపోతుందా ? లేదు, సరిపోదు. వాటి అస్తిత్వంకోసం అవి పరస్పరం ఆధారపడివుండడంతో సమస్య ముగిసిపోవడం లేదు. అంతకంటే ముఖ్యమైన అంశం అవి రెండూ ఒకటి మరొకటిగా పరివర్తన చెందడం. అంటే, నిశ్చిత పరిస్థితుల్లో, ఒక వస్తువులోని విరుద్ధ పక్షాల్లో ప్రతిదీ దాని ఎదుటి పక్షంగా మారుతూంటుంది;

తన స్థితిని మార్చి దాని విరుద్ధ పక్షం స్థితికి వస్తూంటుందన్న మాట. వైరుధ్యంలోని అభిన్నతకు గల రెండవ అర్థం యిదే.

ఇక్కడకూడ అభిన్నత వుందంటే అది ఎందుచేత ? చూడండి, ఒకప్పుడు పాలితులుగా వున్న కార్మిక వర్గం, విప్లవంద్వారా, పాలకవర్గంగా మారిపోతుంది. కాగా యింతదాకా పాలకవర్గంగా వున్న బూర్జువా వర్గం పాలిత వర్గంగా మారిపోతుంది; అంతకుపూర్వందాకా తన విరుద్ధ పక్షం (కార్మిక వర్గం) వున్న స్థితికి మారివస్తుంది. ఈ పరిణామం యిప్పటికే సోవియట్ యూనియన్‌లో సంభవించివుంది; ముందు ప్రపంచవ్యాప్తంగా సంభవిస్తుందికూడ. నిశ్చిత పరిస్థితుల్లో విరుద్ధ పక్షాల నడుమ పరస్పర సంబంధం, అభిన్నత లేకుంటే యిలాంటి మార్పు ఎలా సంభవించ గలదంటారు ?

ఆధునిక చైనా చరిత్రలో ఒక నిశ్చిత దశలో ఒక నిశ్చిత సకారాత్మక పాత్ర నిర్వర్తించిన కొమింటాంగ్ 1927 పిమ్మట ఒక విప్లవప్రతీఘాతక పార్టీ అయిపోయింది; కారణం దాని స్వతస్సిద్ధ వర్గస్వభావం, సామ్రాజ్యవాదుల లాలన, బుజ్జగింపు చర్యలే (యివి పరిస్థితులు). కాని నేడది జపాన్‌ను ప్రతిఘటించడానికి ఒప్పుకోవక తప్పలేదు; కారణం చైనా, జపాన్‌ల మధ్య వైరుధ్యం బాగా పదునెక్కడం, కమ్యూనిస్టు పార్టీ ఐక్యసంఘటనా విధానం అవలంబించడం (యివి నేటి పరిస్థితులు). వైరుధ్యంలోని వస్తువులు, పక్షాలు పరస్పరం ఒకటి మరొకటిగా మారిపోతుంటాయి; ఇక్కడే నిశ్చిత అభిన్నత నెలకొనివుంటుంది. భూమిపై యాజమాన్యం కలిగివుండిన భూస్వామ్య వర్గం ఆ భూమిని కోల్పోయిన వర్గంగా పరివర్తన చెందిన, తమ భూములు కోల్పోయివుండిన రైతులు తిరిగి భూమి గడించుకున్న చిన్న కమతాల యజమానులుగా మారిన క్రమంగా మన వ్యవసాయ విప్లవం వుండింది; మళ్లీ యింకోసారికూడ అలాంటి క్రమంగానే వుంటుంది. నిశ్చిత పరిస్థితుల్లో కలిమి, లేమి; సంపాదించడం, కోల్పోవడం అనేవి పరస్పర సంబంధితాలు. ఈ రెండు పక్షాలమధ్య అభిన్నత వుంటుంది. సోషలిజంలో రైతుల ప్రైవేటు యాజమాన్యం సోషలిస్టు వ్యవసాయపు ప్రజా (సమష్టి) యాజమాన్యంగా పరివర్తన చెందుతుంది. ఈ పరిణామం సోవియట్ యూనియన్‌లో యిప్పటికే సంభవించింది; యితరత్రా అన్ని చోట్లకూడ సంభవిస్తుంది. ప్రైవేటు ఆస్తినుండి ప్రజా(పబ్లిక్) ఆస్తికి దారితీసే ఒక వారధి, తత్వశాస్త్రపదజాలంలో

అభిన్నత, లేక పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చెందడం లేక పరస్పర చొరబాటు అనబడే వారధి వుందని తెలుసుకోవాలి.

అలాగే, కార్మిక వర్గ నియంతృత్వాన్ని లేదా ప్రజల నియంతృత్వాన్ని సుదృఢం గావించడమంటే అసలుకు నియంతృత్వాన్నే రద్దుచేసి, సకల రాజ్యవ్యవస్థలూ నిర్మూలింపబడివుండే మరింత ఉన్నత దశను తీసుకొవడానికి తగిన పరిస్థితుల్ని సిద్ధంగావించడమన్న మాట. కమ్యూనిస్టు పార్టీని నెలకొల్పి, నిర్మించడమంటే వాస్తవానికి కమ్యూనిస్టు పార్టీని, అంతేగాక యితర అన్ని రాజకీయ పార్టీలనుకూడ, నిర్మూలించేందుకు అనువైన పరిస్థితులు తయారు చేయడమే నన్నమాట. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో విప్లవ సైన్యాన్ని నిర్మించి, విప్లవ యుద్ధం సాగించడమంటే నిజానికి యుద్ధాన్నే శాశ్వతంగా లేకుండా చేసే పరిస్థితుల్ని సిద్ధం చేయడమన్న మాట. ఈ విరుద్ధ అంశాలు ఏకకాలంలో పరస్పర పూరకాలుగా వుంటాయని గమనించాలి.

యుద్ధము, శాంతి పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చెందుతుంటాయని ప్రతి ఒక్కరికీ తెలిసిందే. యుద్ధం శాంతిగా మారుతుంది. ఉదాహరణకు, మొదటి ప్రపంచ యుద్ధం యుద్ధానంతర శాంతిగా మారింది; చైనాలో అంతర్యుద్ధం యిప్పుడు ఆగిపోయి ఆంతరంగిక శాంతి నెలకొన్నది. అలాగే శాంతి యుద్ధంగా మారడమూ కద్దు: ఉదాహరణకు, మొదట్లో కొమింటాంగు, కమ్యూనిస్టు పార్టీలమధ్య వుండిన సహకారం 1927లో వాటినడుమ యుద్ధంగా మారిపోయింది; ప్రపంచ శాంతి వున్న నేటి పరిస్థితి మారి రెండవ ప్రపంచ యుద్ధం రావచ్చుకూడ. ఇదిలా ఎందుకు వుంటుంది ? ఎందుకంటే వర్గసమాజంలో యుద్ధము-శాంతి వంటి పరస్పర విరుద్ధ అంశాలు నిశ్చిత పరిస్థితుల్లో అభిన్నత కలిగివుంటాయి గనుక.

విరుద్ధతగల అంశాలన్నీ పరస్పర సంబంధితమై వుంటాయి. నిశ్చిత పరిస్థితుల్లో అవి ఒకే సత్వంలో సహజీవనం సాగించడమేగాక, మరి కొన్ని నిశ్చిత పరిస్థితుల్లో పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చెందుతాయికూడ. విరుద్ధాంశాల అభిన్నతకు సంపూర్ణ అర్థం యిదే. "అవి అభిన్నంగా వుండడం ఎలా జరుగుతుంది (అవలా ఏ విధంగా రూపొందుతాయి), ఏ పరిస్థితుల్లో అవి ఒకటి మరొకటిగా పరివర్తన చెందుతూ, అభిన్నంగా వుంటున్నాయి," అని చర్చించేటప్పుడు లెనిన్ సూచించిన అంతరార్థంకూడ యిదే.

"మానవ మస్తిష్కం ఈ విరుద్ధాంశాలను జీవంలేని, అతికఠినమైన అంశాలుగాకాక, పరస్పరం ఒకటి మరొకటిగా మారుతూండే, సజీవమైన, చలనశీలమైన, నిబంధనాబద్ధమైన అంశాలుగా పరిగ్రహించాలి," అనేది ఎందుకు ? ఎందుకంటే భౌతిక వాస్తవికతలో వస్తువులు సరిగ్గా అలాగే వుంటాయిగనుక. వాస్తవమేమంటే, భౌతిక వస్తుజాలంలో విరుద్ధాంశాల ఐక్యత లేక అభిన్నత నిర్జీవమైనదిగా, అతికఠినమైనదిగా కాక, సజీవమైనది, చలనశీలమైనది, నిబంధనాబద్ధమైనది, తాత్కాలికమైనది, సాపేక్షమైనదిగా వుంటుంది. నిశ్చిత పరిస్థితుల్లో ప్రతి విరుద్ధ పక్షమూ తన్నుతాను తన వ్యతిరేక పక్షం స్థితికి మార్చుకుంటుంది. మనిషి ఆలోచనలో ప్రతిఫలించినప్పుడు యిదే గతితార్కిక భౌతికవాద, మార్క్సిస్టు ప్రాపంచిక దృక్పథం అవుతుంది. విరుద్ధాంశాలను పరస్పరం ఒకటి మరొకటిగా మారుతూండే, సజీవమైన, చలనశీలమైన, నిబంధనాబద్ధమైన అంశాలుగాకాక, జీవంలేని, అతికఠినమైన అంశాలుగా పరిగణించి చూచేది గతకాలంలోనైనా, ప్రస్తుతమైనా అభివృద్ధినిరోధక పాలకవర్గాలు, వారి సేవలోని అధిభౌతికవాదులు మాత్రమే. ప్రజానీకాన్ని భ్రమింపజేయడానికీ, తద్వారా తమ పాలనను శాశ్వతంగావించుకోవడానికీ వాళ్ళు యీ మాయమాటల్ని ప్రతిచోటా ప్రచారం చేస్తుంటారు. అభివృద్ధి నిరోధకులు, అధిభౌతికవాదుల ఈ మాయమాటలు, టక్కుటమారాలను ఎండగట్టడం, వస్తువులలో స్వతస్సిద్ధంగావుండే గతితర్కాన్ని ప్రచారంచేయడం, తద్వారా వస్తువులు, పరిస్థితుల పరివర్తనను త్వరితంగావించి, విప్లవ లక్ష్యాన్ని సాధించడం కమ్యూనిస్టుల కర్తవ్యం.

నిశ్చిత పరిస్థితుల్లో విరుద్ధాంశాల అభిన్నతగురించి మాట్లాడేటప్పుడు, మనం నిజంగా, నిర్దిష్టంగా వుండే విరుద్ధాంశాలను, అవి పరస్పరం ఒకటి మరొకటిగా నిజంగా, నిర్దిష్టంగా పరివర్తన చెందడాలను గురించి ప్రస్తావిస్తున్నామని గ్రహించాలి. పురాణ, జానపద గాథలలోకూడ మనకు అసంఖ్యాక పరివర్తనలు కనిపిస్తాయి. ఉదాహరణకు, **షాన్ హాయ్ చింగ్**[28] లో

---

[28] **షాన్ హాయ్ చింగ్** (పర్వతాలు, సముద్రాల పుస్తకం) కయ్యమాడే రాజ్యాల కాలం (క్రీ. పూ. 403-221)లో రాయబడింది. దానిలో వర్ణించిన ఒక పిట్టకథలో మానవాతీత బలశాలి అయిన **కువా ఫూ**, సూర్యుడ్ని వెంటాడి పరుగెత్తుతూ, చివరకు దాటేస్తాడుకూడ. కాని ఆ క్రమంలో అపారమైన దాహవేదనకు తట్టుకోలేక చనిపోతాడు పాపం. అతడి చేతిలోని దుడ్డుకర్ర కిందపడి, టెంగ్ అడవిగా మారిపోతుంది. (ఇది మన హనుమంతుడు సూర్యుడ్ని మింగిన కథలాలేదూ?).

సూర్యునితో కువా ఫూ పరుగు పోటీ, **హువాయ్ నాన్ జూ**[29] లో నవ సూర్యుల్ని యీ బాణాలతో పడగొట్టడం, **సీ యూ చీ**[30] లో కోతిరాజు డెబ్భై మారు రూపాలు ధరించడం, ఇంకా ***లియావో చాయ్ వింతగాథలు***[31] లోని భూతాలు, నక్కలు మానవరూపాలు ధరించే అనేక పిట్టకథలు, వగైరా ఎన్నో మనం గమనిస్తాము. కాని విరుద్ధాంశాల యీ కాల్పనిక గాథా రూపాంతరాలు నిర్దిష్ట వైరుధ్యాలను ప్రతిఫలించే నిర్దిష్ట మార్పులైతే కావుగదా. అవన్నీ జీవితంలో, వాస్తవికతలో సంభవిస్తూండే అసంఖ్యాక యథార్థ, సంక్లిష్ట విరుద్ధాంశాల పరస్పర పరివర్తనల ప్రభావంలో మానవుల మస్తిష్కాలు గారడిచేసి సృష్టించిన అమాయక, ఊహాజనిత, స్వీయమానసగత కాల్పనిక పరివర్తనలుమాత్రమే. మార్క్స్ యిలా అంటాడు : **“ పౌరాణిక గాథలన్నీకూడ ఊహల్లోనూ, కల్పనల ద్వారానూ ప్రకృతి శక్తులపై విజయం సాధించి, ఆధిపత్యం గడించుకుని, వాటిని యిష్టప్రకారం మలుచుకుంటూ వుంటాయి. కనుక యథార్థ జీవితంలో మనిషి ప్రకృతి శక్తులపై విజయం సాధించి, ఆధిపత్యం గడించడంతోనే అవన్నీ అదృశ్యమై పోతాయి.”**[32] పౌరాణిక గాథల్లోని అసంఖ్యాక మార్పులు (అలాగే పిల్లల కథల్లోనివికూడ) ప్రకృతి శక్తులపై మనిషి విజయాలను కాల్పనికంగా వర్ణించి చెబుతాయిగనుక అవి జనాలకు ఎంతో ఆనందోల్లాసాలు కలిగిస్తుంటాయి. మార్క్స్ అన్నట్లు, **“అత్యుత్తమ పౌరాణికగాథలు అజరామరమైన సమ్మోహకశక్తి కలిగివుంటాయి.”** అయితే ఈ పౌరాణికాలు నిశ్చిత పరిస్థితుల్లో నెలకొనివుండే

---

29 యీ ప్రాచీన చైనా పౌరాణిక వీరయోధుల్లో ఒకడు; విలువిద్యలో బహునిష్ణాతుడు. హువాయ్ నాన్ జూ లోని ఒక పిట్టకథ ప్రకారం యావో చక్రవర్తి కాలంలో ఆకాశంలో పదిమంది సూర్యులు వుండేవారు. దానితో అపారమైన వేడిమికి తట్టుకోలేక చెట్టూచేమా సర్వం నష్టమై, పచ్చదనం అనేదే లేకుండా పోతుండేది. దానితో చక్రవర్తి యావో మన యీ ని పిలిచి, ఆ సూర్యుల్ని బాణాలతో పడగొట్టేయమని ఆదేశిస్తాడు. చక్రవర్తి ఆజ్ఞను యీ నిర్వర్తిస్తాడు. **వాంగ్ యీ (క్రీ.శ. 2వ శతాబ్దం)** చెప్పే కథ ప్రకారం యీ ఒక్క సూర్యుడ్నిమాత్రం మిగిల్చి, తక్కిన తొమ్మిదిమంది సూర్యుల్నీ తన వాడిబాణాలతో పడగొట్టేస్తాడు.

30 సీ యూ చీ (పడమటికి తీర్థయాత్ర) అనేది క్రీ.శ. 16వ శతాబ్దానికి చెందిన ఒక నవల. దానిలో కథానాయకుడు సన్ వూ-కుంగ్ అనే ఒక కోతిదేవుడు. తలచుకున్నంతమాత్రంలో చెట్టుగానో, పిట్టగానో, రాయిగానో, యిలా 72 వేర్వేరు రూపాలు మారే అద్భుత శక్తులు అతనికి వుండేవి.

31 17వ శతాబ్దంలో పూ సుంగ్-లింగ్ రాసిన ***లియావో చాయ్ వింత గాథలు*** మొత్తం 431 కథలున్న ఒక ప్రఖ్యాత కథాసంకలనం. వాటిలో అత్యధికం దయ్యాలు, భూతాలపై, నక్కలు, వాటి ఆత్మలపై అల్లినవే.

32 కార్ల్ మార్క్స్, “రాజకీయార్థ శాస్త్ర విమర్శకు పరిచయం,” **రాజకీయార్థ శాస్త్ర విమర్శకు ఒక దోహదం**, ఇంగ్లీషు ప్రచురణ, చికాగో, 1904, పుటలు 310-11.

నిర్దిష్ట వైరుధ్యాలనుండి సృష్టించబడినవైతే కావుగదా; కనుక అవి వాస్తవికతయొక్క శాస్త్రీయ ప్రతిరూపాలైతే కావు. అంటే, పౌరాణిక గాథలు, పిల్లల కథల్లో వైరుధ్యాన్ని ఏర్పరిచే పక్షాలకు ఒక కాల్పనిక, ఊహామాత్ర అస్తిత్వం, అభిన్నతలే వుంటాయిగాని, నిర్దిష్ట అభిన్నతలు, అస్తిత్వాలు వుండవని చెప్పడమన్న మాట. యథార్థ పరివర్తనల్లో అభిన్నత, అస్తిత్వాలను శాస్త్రీయంగా ప్రతిఫలించడమే మార్క్సిస్టు గతితర్కం.

కోడిగుడ్డు మాత్రమే కోడిపిల్లగా మారగలదుగాని రాయిని కోడిపిల్లగా మార్చశక్యంకాదుగదా. అదెందు చేత? యుద్ధము, శాంతులమధ్య అభిన్నత వుంటుందిగాని యుద్ధానికీ, రాయికీమధ్య అభిన్నతవుండజాలదు ఎందువల్ల? మానవులు మానవులకుమాత్రమే జన్మనివ్వగలరుగాని మరింకే వాటినీ (జంతువులు, చెట్లు వగైరా) కనలేరు అదెందువల్ల? దీనికంతటికీ ఏకైక కారణమేమంటే నిశ్చిత ఆవశ్యక పరిస్థితుల్లోమాత్రమే విరుద్ధాంశాలమధ్య అభిన్నత మనివుండగలదు; ఈ నిశ్చిత ఆవశ్యక పరిస్థితులు లేకపోతే ఎలాంటి అభిన్నతా వుండజాలదు గనుక.

రష్యాలో 1917లో సంభవించిన బూర్జువా ప్రజాస్వామిక ఫిబ్రవరి విప్లవం తర్వాత సంభవించిన కార్మికవర్గ అక్టోబరు విప్లవంతో ప్రత్యక్షంగా లంకె పడివుండిందిగాని, అంతకు పూర్వం [18వ శతాబ్దంలో] ఫ్రాన్సులో సంభవించిన బూర్జువా విప్లవం ఏ సోషలిస్టు విప్లవంతోనూ ప్రత్యక్షంగా ముడివడివుండలేదు అది ఎందుచేత? పైగా 1871నాటి పారిస్ కమ్యూన్ [33] విఫలమైంది ఎందువల్ల? కాగా, మరోవైపున, నేడు మంగోలియా, మధ్య

[33] **పారిస్ కమ్యూన్** ప్రపంచ చరిత్రలోని ప్రప్రథమ కార్మిక వర్గ రాజకీయాధికార అంగం. 1871, మార్చి 18వ తేదీనాడు ఫ్రెంచి కార్మికవర్గం పారిస్‌లో ఒక తిరుగుబాటు చేసి, అధికారం కైవసం చేసుకున్నది. కార్మికవర్గ నాయకత్వంలో, ఎన్నికలద్వారా మార్చి 28వ తేదీన పారిస్ కమ్యూన్ వ్యవస్థాపితమైంది. బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని బద్దలుచేయడానికి కార్మికవర్గం చేసిన తొట్టతొలి విప్లవ ప్రయత్నమది. కూలద్రోయబడిన బూర్జువా రాజ్యాధికారంస్థానే కార్మికవర్గ రాజ్యాధికారాన్ని ప్రతిష్ఠాపించడానికి జరిగిన అపూర్వకృత్యమది. అయితే అప్పట్లో ఫ్రెంచి కార్మికవర్గం తగినంత పరిపక్వంగా లేనందువల్ల, అది దాని మిత్రవర్గమైన రైతాంగంతో ఐక్యత సాధించలేకపోయింది. విప్లవప్రతీఘాతకులపట్ల మరీ మెతకగా ప్రవర్తించింది; సకాలంలో, దృఢనిశ్చయంతో, సైనిక దాడులు ప్రారంభించలేదు. దానితో విప్లవ ప్రతీఘాతకులు, ఓడి, పారిన తమ బలగాలను తాపీగా కూడదీసుకుని, తిరిగి వెనక్కువచ్చి, తిరుగుబాటుదారులపై దాడిచేసి, తిరుగుబాటులో పాల్గొన్న ప్రజలపై కిరాతకమైన మారణకాండ జరపగలిగారు. పర్యవసానంగా మే 28వ తేదీన పారిస్ కమ్యూన్ పతనమైంది.

ఆసియాల్లో గల దేశదిమ్మరి(సంచార జాతి) వ్యవస్థ సోషలిజంతో ప్రత్యక్షంగా ముడివడివుంది ఏ కారణంగా? చైనా విప్లవం పాశ్చాత్య దేశాలు అనుసరించిన పాత చారిత్రక మార్గాన్ని తీసుకోకుండానే, బూర్జువా నియంతృత్వ దశగుండా పయనించకుండానే పెట్టుబడిదారీ భవిష్యత్తును తప్పించుకుని, సోషలిస్టు విప్లవంతో ప్రత్యక్షంగా ముడివడివుండగలదంటే అదెందువల్ల? దీనికంతటికీ ఏకైక కారణం ఆయా కాలాలకు చెందిన నిర్దిష్ట పరిస్థితులే. కొన్ని నిశ్చిత ఆవశ్యక పరిస్థితులు వున్నప్పుడు, వస్తువుల అభివృద్ధి క్రమంలో కొన్ని నిశ్చిత వైరుధ్యాలు తలెత్తుతాయి; పైగా, ఆ వైరుధ్యాలలోని విరుద్ధ పక్షాలు(అంశాలు) పరస్పరాధారితమై, ఒకటి మరొకటిగా పరివర్తన చెందుతాయి. ఇలా లేని పక్షంలో పైన చెప్పినదేదీకూడ సాధ్యపడదని గ్రహించాలి.

అభిన్నతకు సంబంధించిన సమస్యయితే యిలా వుంది. మరి పోరాటం అంటే ఏమిటి ? అభిన్నతకు, పోరాటానికి(ఘర్షణకు) నడుమ సంబంధం ఏమిటి ?

లెనిన్ యిలా అంటాడు :

**విరుద్ధాంశాల ఐక్యత (ఏకీభవనం, అభిన్నత, సమానచర్య) నిబంధనాబద్ధం (conditional) , తాత్కాలికం, పరివర్తనాశీలం, సాపేక్షంమాత్రమే. పరస్పరం వేరు వేరుగావుండే ఈ విరుద్ధాంశాలమధ్య పోరాటంమాత్రమే – అభివృద్ధి, చలనం ఎలా అఖండంగా వుంటాయో యిదీ సరిగ్గా అలాగే – అఖండమైనది.** [34]

పై మాటలకు అర్థమేమిటి ?

అన్ని క్రమాలు, అన్ని ప్రక్రియలకూ ఒక ఆరంభం, ఒక అంతం వుంటాయి; సకల క్రమాలూ తమ్ము తమ విరుద్ధపక్షాలుగా పరివర్తన చేసుకుంటాయి. సకల క్రమాల నిశ్చలత (నిరంతరాయత - constancy) సాపేక్షమైనదేగాని, ఒక క్రమం మరొక క్రమంగా మారడంలో అభివ్యక్తమయ్యే పరివర్తనాశీలత (mutability) మాత్రం అఖండమైనది (నిరపేక్షమైనది).

---

[34] వి.ఐ. లెనిన్, "గతితర్కం సమస్యపై," సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పుట 358.

వస్తువులన్నింటిలోనూ రెండు చలనస్థితులు - సాపేక్ష విశ్రాంతి, స్పష్టమైన మార్పు - వుంటాయి. ఈ రెండూకూడ వస్తువులోనే యిమిడివుండే రెండు విరుద్ధ అంశాలనడుమ పోరాటం(ఘర్షణ)కారణంగా జనిస్తాయి. ఏదైనా వస్తువు మొదటి చలన స్థితిలో వున్నప్పుడు, అది పరిమాణాత్మక మార్పుకుమాత్రమే లోనవుతుందిగాని గుణాత్మక మార్పుకు కాదు. కనుక అది బయటకు, విశ్రాంతి స్థితిలో వున్నట్లు అగుపిస్తుంది. ఆ వస్తువు రెండవ చలన స్థితిలో వున్నప్పుడు, మొదటి స్థితికి చెందిన పరిమాణాత్మక మార్పు అప్పటికే ఒక పరాకాష్టకు చేరి వుంటుంది; పర్యవసానంగా అంతదాకా ఒక సత్వంగావున్న ఆ వస్తువు ఆపై విచ్ఛిన్న మయేందుకు దారి తీస్తుంది. దానితో ఒక గుణాత్మక మార్పు ప్రారంభమవుతుంది; కనుకనే, స్పష్టమైన మార్పు అగుపడుతుంది. కనుక నిత్యజీవితంలో మనం గమనించే ఐక్యత, సంఘీభావం, సంయోగం, పొందిక, సమతూకం, ప్రతిష్టంభన, ఎటూతెగని స్థితి, విరామం, నిరంతరాయత, సమతౌల్యం, గట్టితనం, ఆకర్షణ మొదలైన ధర్మాలన్నీ పరిమాణాత్మక మార్పు స్థితిలోవున్న వస్తువుల దృశ్యమాన రూపాలని గ్రహించాలి. పోతే, మరో వైపు, ఈ ఐక్యత విచ్ఛిన్నమవడం, అంటే ఈ సంఘీభావం, సంయోగం, పొందిక, సమతూకం, ప్రతిష్టంభన, ఎటూతెగని స్థితి, విరామం, నిరంతరాయత, సమతౌల్యం, గట్టితనం, ఆకర్షణ మొదలైనవన్నీ నశించడం, వీటిలో ప్రతిదీ దాని విరుద్ధ అంశంగా మార్పుచెందడం - యివన్నీ గుణాత్మక మార్పు స్థితిలో వున్న వస్తువుల గోచరరూపాలు, ఒక క్రమం మరొక క్రమంగా పరిణమించే రూపాంతర స్థితులని తెలుసుకోవాలి. వస్తువులు నిరంతరం తమను తాము మొదటి చలన స్థితినుండి రెండవ చలన స్థితికి మార్పుచేసుకుంటూ వుంటాయి. విరుద్ధ అంశాలమధ్య పోరాటం(ఘర్షణ) ఈ రెండు స్థితుల్లోనూ సాగుతూంటుంది గాని, రెండవ స్థితిద్వారానే వైరుధ్యం పరిష్కారమౌతుంది. అందుకే మనం విరుద్ధాంశాల మధ్య ఐక్యత షరాస్థితిబద్ధం (conditional), తాత్కాలికం, సాపేక్షం అనీ, కాగా పరస్పరం వేర్వేరుగావుండే ఈ విరుద్ధ పక్షాలనడుమ పోరాటం(ఘర్షణ)మట్టుకు అఖండం(నిరపేక్షం) అనీ అంటాము.

రెండు విరుద్ధ వస్తువులు ఒకే సత్వంలో కలిసివుండగలవు, పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చేసుకోగలవు, ఎందుకంటే వాటినడుమ అభిన్నత వున్న కారణంగానని మనం పైన అన్నప్పుడు మనం ఒక నిబంధనాబద్ధత

(షరాస్థితి - conditionality) గురించి మాట్లాడుతున్నామన్న మాట. అంటే, కొన్ని నిశ్చిత పరిస్థితుల్లో రెండు విరుద్ధ అంశాలు ఒకే సత్వంలో ఏకం చేయబడగలవు; తమ్ము తాము పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చేసుకోగలవు కాని ఈ పరిస్థితులేగనుక లేకుంటే అవి ఒక వైరుధ్యంగా ఏర్పడజాలవు, ఒకే సత్వంలో సహజీవనం చేయజాలవు, పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చేసుకోజాలవని చెప్పుతున్నామన్న మాట. విరుద్ధాంశాల అభిన్నత కొన్ని నిశ్చిత పరిస్థితుల్లోమట్టుకే నెలకొని వుంటుందిగనుకే మనం అభిన్నత షరాస్థితిబద్ధం, సాపేక్షం అని అన్నాము. కాగా, విరుద్ధ అంశాలమధ్య పోరాటం(ఘర్షణ)మాత్రం ఒక క్రమంలో ఆదినుండి తుదిదాకా వ్యాపించివుంటుంది, అదే ఒక క్రమం తన్నుతాను మరొక క్రమంగా పరివర్తన చేసుకునేట్లు చేస్తుంది - అంటే అది(పోరాటం) సర్వవ్యాప్తంగా, కనుక నిర్నిబంధంగా, అఖండం(నిరపేక్షం)గా వుంటుంది అనికూడ మనం చెప్పవచ్చు.

షరాస్థితిబద్ధమైన, సాపేక్షమైన అభిన్నత, నిర్నిబంధం, నిరపేక్షం(అఖండం) అయిన పోరాటం - వీటి సంయోగమే సకల వస్తువుల్లోనూ విరుద్ధాంశాల చలనాన్ని కలగజేస్తుంది.

" **పరస్పరం ఎదిరించుకునే వస్తువులు పరస్పరం పూరించుకుంటూనూ వుంటాయి,**"[35] అని మనం చైనావాళ్లం తరచూ అంటూంటాం. అంటే, పరస్పర విరుద్ధమైన వస్తువులమధ్య అభిన్నత వుందనడమన్న మాట. ఈ సూక్తి గతితార్కికమైనది, అధిభౌతికవాదానికి వ్యతిరేకమైనది. "పరస్పరం ఎదిరించడం," అనేది రెండు విరుద్ధ పక్షాల(అంశాల) పరస్పర వేరుసేత లేక పోరాటాన్ని సూచిస్తుంది. "**పరస్పరం పూరించు,**" అంటే నిశ్చిత పరిస్థితుల్లో రెండు విరుద్ధ అంశాలు(పక్షాలు) ఐక్యమౌతాయి; అభిన్నతను సాధిస్తాయి అని అర్థం. అయినా, పోరాటం అభిన్నతలో అంతర్గతంగా(స్వతస్సిద్ధంగా) వుంటుంది; పోరాటం లేకుండా అభిన్నత అనేదే వుండజాలదనికూడ తెలుసుకోవాలి.

---

35 " పరస్పర ప్రత్యర్థి అంశాలు పరస్పర పూరకాలుగాకూడ వుంటాయి," అనే సూక్తి మొదటగా క్రీ.శ. 1వ శతాబ్దానికి చెందిన సుప్రసిద్ధ చరిత్రకారుడు పాన్ కూ రాసిన "తొలి హాన్ రాజవంశ చరిత్ర" లో మనకు తటస్థపడుతుంది. అది చిరకాలంగా ఒక జనప్రియమైన నానుడిగా చెలామణీ అవుతూ వస్తున్నది.

అభిన్నతలో పోరాటం వుంది, ప్రత్యేకతలో విశ్వజనీనత వుంది, వ్యక్తిసత్వంలో సాధారణత్వం వుంది. లెనిన్ మాటల్లో, "... ... సాపేక్షతలో నిరపేక్షత(అఖండత్వం) వుంది."[36]

## 6. వైరుధ్యంలో వైరం స్థానం

విరుద్ధాంశాల పోరాటం సమస్యలో వైరం(శత్రుత్వం antagonism) అంటే ఏమిటనే సమస్యకూడ యిమిడివుంటుంది. వైరం అనేది విరుద్ధాంశాల పోరాటానికి సంబంధించిన ఒక రూపం; అయితే ఏకైక రూపమైతేకాదు అని మనం జవాబిస్తాము.

మానవ చరిత్రలో వర్గాలమధ్య వైరం విరుద్ధాంశాల పోరాటపు ఒక ప్రత్యేక అభివ్యక్తీకరణగా మనివుంటుంది. దోపిడీచేసే, దోపిడీకి గురయ్యే (పీడక, పీడిత) వర్గాలమధ్య వైరుధ్యాన్నే పరిశీలించండి. ఇలాంటి విరుద్ధ వర్గాలు ఒకే సమాజంలో - అది బానిస సమాజమేకాని, ఫ్యూడల్ సమాజమేగాని, లేక పెట్టుబడిదారీ సమాజమేగాని - చిరకాలంగా సహజీవనం సాగిస్తూవస్తుంటాయి. అయితే ఈ రెండు వర్గాలు ఒక నిశ్చిత దశకు అభివృద్ధి చెందేంతదాకా వాటి వైరుధ్యం బాహాట వైర రూపం ధరించదు; అలా అభివృద్ధి చెందినప్పుడే అది వైరరూపం ధరించి, విప్లవంగా వికసిస్తుంది. వర్గసమాజంలో శాంతి, యుద్ధంగా పరివర్తన చెందడానికి సంబంధించి కూడ యిదే వర్తిస్తుంది.

ఒక బాంబునే తీసుకుంటే, అది పేలేముందరివరకు ఒకే సత్వంగా వుంటుంది; అంతదాకా, నిశ్చిత పరిస్థితుల్లో, విరుద్ధ శక్తులు(అంశాలు) దానిలో సహజీవనం సాగిస్తూంటాయి. ఒక కొత్త పరిస్థితి, అగ్గి అంటుకోవడం, వున్నప్పుడు మాత్రమే పేలుడు సంభవిస్తుంది. పాత వైరుధ్యాల్ని పరిష్కరించి, కొత్త వస్తువుల్ని సృష్టించడానికిగాను అంతిమంగా బాహాట ఘర్షణ రూపాన్ని ధరించే ఆయా సహజ (ప్రకృతిసిద్ధ) పరిణామాలన్నిటిలోనూ, దీన్ని పోలిన పరిస్థితే నెలకొనివుంటుంది.

---

[36] వి.ఐ.లెనిన్, "గతితర్కం సమస్యపై," సేకరించిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో, 1958, సంపుటం XXXVIII, పుట 358.

ఈ వాస్తవాన్ని గ్రహించడం ఎంతో ముఖ్యం. దీనిమూలంగా, వర్గ సమాజంలో విప్లవాలు, విప్లవ యుద్ధాలు అనివార్యమని, అవి లేకుండా సాంఘిక అభివృద్ధిలో ఏ గంతుని సాధించడంగాని, అభివృద్ధినిరోధక పాలకవర్గాలను కూలద్రోయడంగాని అసాధ్యమని, కనుక ప్రజలు రాజకీయాధికారం గెలుచుకోవడం అసాధ్యమని మనం అర్థం చేసుగల్గుతాము. సాంఘిక విప్లవం అనవసరమేగాక అసాధ్యం కూడాననే దృఢప్రకటనలు, వగైరాలతో అభివృద్ధినిరోధకులు సాగించే మోసపూరిత ప్రచారాన్ని మనం కమ్యూనిస్టులం బట్టబయలు గావించాలి. మార్క్సిస్టు-లెనినిస్టు సామాజిక విప్లవ సిద్ధాంతాన్ని దృఢంగా సంరక్షిస్తూ, సాంఘిక విప్లవం సంపూర్ణంగా ఆవశ్యకమేగాక పూర్తిగా ఆచరణీయంకూడానని, మానవజాతి చరిత్ర సమస్తం, అలాగే సోవియట్ యూనియన్ సాధించిన విజయం, ఈ శాస్త్రీయ సత్యాన్ని ధ్రువీకరించాయని ప్రజలు అర్థం చేసుకొనేలా చేయాలి.

అయితే, మనం ప్రతి ప్రత్యేక విరుద్ధాంశాల పోరాటపు పరిస్థితుల్నీ నిర్దిష్టంగా అధ్యయనం చేయాలేగాని పైన చర్చించిన ఫార్ములాను యిష్టం వచ్చినట్లు ప్రతిదానికీ అన్వయించరాదు. వైరుధ్యం, పోరాటం(ఘర్షణ) అనేవి విశ్వజనీనమైనవి, అఖండమైనవేగాని, ఆ వైరుధ్యాలను పరిష్కరించే పద్ధతులు, అంటే పోరాట రూపాలుమాత్రం వైరుధ్యాల స్వభావాలలోవుండే తేడాలనుబట్టి విభేదిస్తుంటాయి. కొన్ని వైరుధ్యాలు బాహాటవైరపు స్వభావాన్ని కలిగివుంటే, తక్కినవి అలా వుండవు. అంతేగాక, వస్తువుల నిర్దిష్ట వికాసక్రమాన్నిబట్టి కొన్ని వైరుధ్యాలు మొదట వైరరహితంగా వున్నా ఆనక శత్రుపూరితంగా మారుతాయి; కాగా మరికొన్ని తొలుత వైరపూరితంగా వున్నా తర్వాత వైరరహితంగా రూపొందుతాయి.

ముందే చెప్పినట్లు, వర్గాలనేవి వున్నంతవరకూ, కమ్యూనిస్టు పార్టీలోని సరియైన, సరికాని అభిప్రాయాలనడుమ వుండే వైరుధ్యాలు సమాజంలోని వర్గ వైరుధ్యాలు పార్టీలోపల ప్రతిఫలించిన ఫలితమే. మొదట్లో, కొన్ని కొన్ని సమస్యలకు సంబంధించి యిలాంటి వైరుధ్యాలు శత్రు వైరుధ్యాలుగా అభివ్యక్తం కాకపోవచ్చు. కాని, వర్గ పోరాటం వృద్ధిచెందేకొద్దీ, అవి పెరిగిపెద్దయి, శత్రుపూరితంగా రూపొందవచ్చుకూడ. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు

పార్టీ చరిత్ర చూస్తే, లెనిన్, స్టాలిన్‌ల సరైన ఆలోచనకు, ట్రాట్స్కీ,[37] బుఖారిన్, తదితరుల తప్పుడు(భ్రమజనక) ఆలోచనకు మధ్యగల వైరుధ్యాలు మొదట్లో

[37] ట్రాట్స్కీ(1879-1940) మొదట్లో రష్యన్ విప్లవోద్యమంలోని ఒక లెనినిస్టువ్యతిరేక ముఠాకు నాయకత్వం వహించాడు. తర్వాతికాలంలో బాగా దిగజారి, ఒక విప్లవప్రతీఘాతకుల ముఠాలో చేరాడు. 1927 లో సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ అతడ్ని పార్టీనుండి బహిష్కరించింది. 1929లో సోవియట్ ప్రభుత్వం అతడ్ని దేశంనుండి వెళ్లగొట్టింది; 1932లో అతడి సోవియట్ పౌరసత్వంకూడ రద్దుచేయబడింది.

[ అసలు పేరు **లెవ్ డేవిడోవిచ్ బ్రాన్‌స్టీన్.** జననం : 1879 నవంబరు 7న - ఉక్రెయిన్‌లోని యానోవ్కాలో; మరణం: 1940 ఆగష్టు 20వ మెక్సికో సిటీవద్ద. రష్యన్ యూదు కుటుంబంలో పుట్టిన ట్రాట్స్కీ 1896నుండే విప్లవ కార్మిక రాజకీయాల్లో పాల్గొంటూవచ్చాడు. 1898 జనవరిలో అరెస్టుచేయబడి,సైబీరియాలో ప్రవాసానికి పంపబడ్డాడు. 1902లో ట్రాట్స్కీ పేర ఒక నకిలీ పాస్‌పోర్టు సృష్టించుకుని, దాని సాయంతో ప్రవాసంనుండి పారిపోయి, లండన్ చేరుకున్నాడు. అక్కడ లెనిన్, తదితర సోషల్ డెమోక్రట్లతోకలిసి ఇస్క్రా (పార్టీ పత్రిక) నిర్వహణలో పాల్గొన్నాడు. 1903లో బ్రస్సెల్సు, లండన్‌లలో జరిగిన రష్యన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ 2వ మహాసభలో ట్రాట్స్కీ లెనిన్‌ను వ్యతిరేకిస్తూ, మార్టోవ్ తదితర మెన్షివిక్కుల బృందంలో చేరాడు. 1905 విప్లవం బద్దలయినప్పుడు రష్యాకు తిరిగివెళ్లి, విప్లవంలో అతి ప్రముఖ పాత్ర వహించాడు. పెట్రోగ్రాడ్ సోవియట్‌కు ప్రముఖ నాయకునిగా దేశవ్యాప్త విప్లవ కార్మిక సాధారణ సమ్మె ఆర్గనైజేషనులో ముఖ్య భూమిక వహించాడు. విప్లవవైఫల్యంతో మళ్లీ జైలుపాలై, సైబీరియాలో మరోసారి ప్రవాసశిక్ష అనుభవించాల్సివచ్చింది. 1907 లో మళ్లీ పరారై, వియన్నా చేరుకున్నాడు. అటునుండి స్విట్జర్లండు, ఫ్రాన్సు, స్పెయిన్ తదితర ఐరోపాదేశాల్లో తలదాచుకుంటూ విప్లవ కార్యకలాపాలు కొనసాగించాడు. మొదటి ప్రపంచ యుద్ధం బద్దలయినప్పటినుండి విప్లవ కార్మికవర్గ విధానం అవలంబిస్తూ యుద్ధాన్ని తీవ్రంగా నిరసిస్తూ ప్రచారం, ఆందోళనా కార్యకలాపాలు చేపట్టడంతో ఫ్రాన్సు, స్పెయిన్‌లనుండి బహిష్కరించబడ్డాడు. 1917 జనవరిలో న్యూయార్కు చేరుకుని, బుఖారిన్ ప్రభృతులతో కలిసి నోవీ మీర్ పత్రిక నడిపాడు. రష్యాలో జారు చక్రవర్తిని కూలదోసిన ఫిబ్రవరి విప్లవం బద్దలు కావడంతో తిరిగి స్వదేశం ప్రయాణం కట్టాడు. మే నెలలో పెట్రోగ్రాడ్ చేరుకున్న ట్రాట్స్కీ వామపక్ష మెన్షివిక్కు విధానాలతో కార్మిక, సైనిక సోవియట్లకు పూర్తి అధికారంకావాలంటూ, మొదటినుండీ తాత్కాలిక (బూర్జువా) ప్రభుత్వాన్ని ఎదిరించసాగాడు. జూలై తిరుగుబాటు వైఫల్యంతర్వాత కెరెన్స్కీ ప్రభుత్వంచే అరెస్టుచేయబడి కొంతకాలం ఖైదులోవున్నాడు. జైలులోవుండగానే ఆగష్టులో బోల్షివిక్కు పార్టీలో చేరడమేగాక, బోల్షివిక్కు కేంద్రకమిటీలోకి తీసుకోబడ్డాడు. అక్టోబరు విప్లవాన్ని విజయవంతంగా నిర్వహించిన నాయకుల్లో ముఖ్యునిగా, కీలకమైన సైనిక విప్లవ కమిటీకి అధ్యక్షునిగా వుండినాడు. అప్పట్లో లెనిన్‌తో దాదాపు సమానస్థాయి నాయకునిగా వుండేవాడు. బోల్షివిక్కు పార్టీని లెనిన్-ట్రాట్స్కీల పార్టీ అనికూడ అంటూండేవారు. విప్లవ ప్రభుత్వంలో విదేశాంగ మంత్రిగా వుండి, బ్రెస్ట్-లిటోవ్స్కీ సంభాషణలు నడిపాడు. కాని ఎటుబడీ జర్మనీతో సంధి కుదుర్చుకోవాలన్న లెనిన్‌తోగాని, కాదు విప్లవ యుద్ధంగా కొనసాగించాలన్న బుఖారిన్‌తోగాని ఏకీభవించక, **యుద్ధమూ వద్దు – శాంతీ లేదు** అనే విధానం అవలంబించాడు. కాని కీలకమైన కేంద్ర కమిటీ సమావేశంలో తన అనుయాయులతోబాటు గైరుహాజరవడంమూలంగా లెనిన్ నెగ్గడానికి అవకాశం కల్పించాడు. బోల్షివిక్కు శిశువును పసితనంలోనే గొంతునులిమిచంపేయాలనే దుష్టబుద్ధితో 14 పెట్టుబడిదారీ దేశాలు జరిపిన సైనిక జోక్యం, కోల్చాక్, డెనికిన్ తదితరుల సారథ్యంలో స్వదేశీ తెల్లసైన్యాలు సాగించిన భీకర అంతర్యుద్ధాలను సమర్థవంతంగా ఎదిరించి, గెలిచిన ఎర్ర సైన్యపు నిర్మాత, సారథుల్లో ముఖ్యుడుగా మన్ననలందుకున్నాడు. లెనిన్ చివరిరోజుల్లో ఆయనకు మరింత సన్నిహితమయ్యాడు గాని స్టాలిన్ ఆగ్రహానికి పాత్రుడయ్యాడు. లెనిన్

వైరపూరితంగా అభివ్యక్తంకాలేదుగాని, అనంతరకాలంలో అవలా శత్రుపూరితంగా రూపొందాయని గమనిస్తాము. చైనా కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో కూడ మనకు యిలాంటి ఉదాహరణలు కనిపిస్తాయి. మొదట్లో మన కామ్రేడ్లు అనేకమందికి వుండిన సరైన ఆలోచనలకు, చెన్ టూ సూ, చాంగ్ కువో టావో, తదితరుల తప్పుడు ఆలోచనలకు మధ్య వైరుధ్యాలు వైరపూరితంగా అభివ్యక్తం కాలేదుగాని, తర్వాత తర్వాత అవి శత్రుపూరితంగా పరిణమించాయి. ప్రస్తుతం మన పార్టీలోపల సరైన ఆలోచనలకు, సరికాని ఆలోచనలకు మధ్య వైరుధ్యం శత్రుపూరితంగా పరిణమించనైతేలేదు; తప్పులు చేసివున్న కామ్రేడ్లు వాటిని సవరించుకొనే పక్షంలో ముమ్ముందుకూడ అది వైరపూరితంగా రూపొందదు. కనుక, పార్టీ ఒకవైపు తప్పుడు ఆలోచనలకు వ్యతిరేకంగా తీవ్ర పోరాటం జరుపుతూనే, మరోవైపు తప్పులు చేసిన కామ్రేడ్లు మేల్కొనేందుకు వారికి తగిన అవకాశం యివ్వాలికూడ. అందువల్ల మితి మీరిన [ వేధించేస్థాయికి ] పోరాటం చేయడమైనా అనుచితమేననేదీ సుస్పష్టమే. కాని తప్పులు చేసినవాళ్ళుగనుక వాటిని .అలాగే కొనసాగిస్తూ యింకా తీవ్రతరంచేస్తూపోతే, అప్పుడీ వైరుధ్యం శత్రుపూరితంగా రూపొందే అవకాశం వుంటుంది.

---

అనంతరం స్టాలిన్-జినోవీవ్-కామెనీవ్‌ల కూటమికి విరుద్ధంగా కొంతకాలం బుఖారిన్‌తో పొత్తుకలిసినా, తర్వాత సమష్టీకరణ, సత్వర పారిశ్రామికీకరణ, శాశ్వత విప్లవంవంటి విధానాలు బలంగా ప్రతిపాదించడంద్వారా బుఖారిన్‌నూ దూరంచేసుకుని పొలిట్ బ్యూరోలో దాదాపు ఏకాకై పోయాడు. దానితో స్టాలిన్ వేగంగా ఎత్తులు వేసి ట్రాట్స్కీని మొదట పొలిట్‌బ్యూరోనుండి, తర్వాత 1927లో పార్టీనుండే తొలగించాడు. 1928లో మధ్య ఆసియాలోని అల్మా అటాలో ప్రవాసానికి పంపబడ్డ ట్రాట్స్కీ 1929లో దేశంనుండే బహిష్కరించబడ్డాడు. మొదట వివిధ ఐరోపా దేశాల్లో తలదాచుకున్న ట్రాట్స్కీ 1936 లో మెక్సికోలో ఆశ్రయం పొందాడు. విదేశాలనుండి స్టాలిన్ నిరంకుశ విధానాలను తీవ్రంగా వ్యతిరేకిస్తూ, ప్రత్యేకించి ప్రత్యర్థులందరినీ హతమార్చే క్రూర దమనకాండను నిరసిస్తూ ప్రత్యామ్నాయ అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ నిర్మాణానికి చాల ప్రయత్నంచేసాడుగాని అదంతగా ఫలించలేదు. ఫాసిజానికి వ్యతిరేకంగా రాజీలేని సైద్ధాంతిక, రాజకీయ పోరాటం సాగించిన పర్యవసానంగా హిట్లర్ తీవ్ర ఆగ్రహానికికూడ గురయ్యాడు. దినదినగండంగా బతుకు ఈడ్వాల్సివచ్చింది. చివరకు మెక్సికో సిటీవద్ద కయోవాకాన్ (Coyoacan) లో స్థిరపడివుండగా 1940 ఆగస్టులో రామొన్ మెర్కాడర్ అనే స్పానిష్ కమ్యూనిస్టు (స్టాలిన్ ఆ పనికి ప్రత్యేకంగా నియమించిన ఏజంటు)చే దారుణంగా హత్యచేయబడ్డాడు. స్టాలిన్‌ను చంపడానికి ట్రాట్స్కీ, ట్రాట్స్కీని చంపడానికి స్టాలిన్ ఎత్తులు జిత్తులు అనేకం వేసుకున్నారని, ఈ యిద్దరు బద్ధశత్రువుల పోరులో తుదకు స్టాలిన్‌దే గెలుపయిందనికూడ అంటారు. ఏమైనా ఒక అపూర్వ సోషలిస్టు మేధావి, రాజీలేని మార్క్సిస్టు సిద్ధాంతవేత్త, మహత్తర అక్టోబరు సోషలిస్టు విప్లవ ప్రముఖ నాయకుల్లో ఒకడు, బహుముఖ ప్రతిభాశాలి, బహుభాషావేత్త, మహావక్త, గొప్ప రచయిత జీవితం యిలా అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలోని హేయమైన అంతఃకలహాలకు యిలా బలైపోయింది].

ఆర్థికపరంగా, బూర్జువావర్గం పాలనలో పట్టణాలు పల్లెపట్టుల్ని నిర్దాక్షిణ్యంగా కొల్లగొడుతూండే పెట్టుబడిదారీ సమాజంలోనేగాని, లేక విదేశీ సామ్రాజ్యవాదులు, చైనాదేశ బడా దళారీ బూర్జువావర్గాల పాలనలో పట్టణాలు పల్లెసీమల్ని అతిక్రూరంగా దోపిడీచేస్తూండే చైనాలోని కొమింటాంగ్ పాలిత ప్రాంతాల్లోనేగాని పట్టణాలకు, గ్రామీణప్రాంతాలకు మధ్య వైరుధ్యం మిక్కిలి శత్రుపూరితంగా వుంటుంది. కాని సోషలిస్టు దేశంలోనూ, మన విప్లవ స్థావర ప్రాంతాల్లోనూ ఈ శత్రు వైరుధ్యం ఒక వైరరహిత వైరుధ్యంగా మారిపోయింది. కమ్యూనిస్టు సమాజదశను చేరుకున్నప్పుడు అది పూర్తిగా రద్దయిపోతుంది.

లెనిన్ యిలా అంటాడు : " వైరం, వైరుధ్యం రెండూ ముమ్మూర్తులా ఒక్కటేమీ కావు. సోషలిజంలో మొదటిది అదృశ్యమౌతుంది; రెండోదిమాత్రం మిగిలివుంటుంది."[38] అంటే, విరుద్ధాంశాల పోరాటానికిసంబంధించి వైరం (శత్రుత్వం) ఒక రూపమేగాని ఏకైక రూపమైతే కాదని చెప్పదలచుకున్న మాట. శత్రుపూరిత వైరుధ్యాల ఫార్ములాలను యధేచ్ఛగా ప్రతిచోటా ప్రయోగించరాదు.

## 7. ముగింపు

మన మిప్పుడు యిదంతా కొన్ని వాక్యాల్లో సంగ్రహంగా చెప్పుకుందాం. వస్తువులలోని వైరుధ్య సూత్రం, అంటే, విరుద్ధాంశాల ఐక్యతా సూత్రం, ప్రకృతికి, సమాజానికి సంబంధించిన ఒక మౌలిక సూత్రం; కనుక అది ఆలోచనకు సంబంధించిన ఒక మౌలిక సూత్రంకూడానూ. అది అధిభౌతికవాద ప్రాపంచిక దృక్పథానికి విరుద్ధంగా నిలిచివుంటుంది. మానవ జ్ఞాన చరిత్రలో ఒక గొప్ప విప్లవానికి అది ప్రాతినిధ్యం వహిస్తుంది. గతితార్కిక భౌతికవాదం ప్రకారం, భౌతికంగా మనివుండే వస్తువులు, స్వీయమానసికంగావుండే ఆలోచనలకు సంబంధించిన సమస్త క్రమాల్లోనూ వైరుధ్యం ఉనికిలోవుంటుంది; అది ఈ క్రమాలన్నింటిలోనూ ఆదినుండి అంతందాకా వ్యాపించివుంటుంది. ఇదే వైరుధ్యపు విశ్వజనీనత, అఖండత(నిరపేక్షత). ప్రతి వైరుధ్యమూ, దాని ఉభయ పక్షాల్లో(కోణాల్లో) ప్రతి ఒక్కటీ తమ తమ ప్రత్యేక ధర్మాలు కలిగివుంటాయి. ఇది వైరుధ్యపు ప్రత్యేకత, సాపేక్షత. నిశ్చిత పరిస్థితుల్లో విరుద్ధాంశాలు అభిన్నత కలిగివుంటాయి. పర్యవసానంగా

---

[38] వి.ఐ. లెనిన్, "ఎన్.ఐ. బుఖారిన్ రాసిన పరివర్తనాకాలపు ఆర్థిక విధానాలు పై వ్యాఖ్యలు," ఎంపికచేసిన రచనలు, రష్యన్ ప్రచురణ, మాస్కో- లెనిన్‌గ్రాడ్, 1931, సం. XI, పు. 357.

అవి ఒకే సత్వంలో సహజీవనం సాగించగల్గుతాయి; పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చేసుకో గల్గుతాయి. ఇదికూడ వైరుధ్యపు ప్రత్యేకత, సాపేక్షతే. అయితే, విరుద్ధాంశాలు సహజీవనం సాగిస్తున్నప్పుడు, అలాకాక అవి పరస్పరం ఒకటి మరొకటిగా పరివర్తన చేసుకుంటున్నప్పుడు - రెండు సందర్భాల్లోనూ ఈ విరుద్ధాంశాల పోరాటం నిర్విరామంగా సాగిపోతూనేవుంటుంది; నిజానికి విరుద్ధాంశాలు పరస్పర పరివర్తన చేసుకునేటప్పుడు ఈ పోరాటం మరీ కొట్ట వచ్చినట్లు గోచరిస్తూంటుంది. మరి ఇదిసైతం వైరుధ్యపు విశ్వజనీనత, అఖండతే. ఒక వైరుధ్యపు ప్రత్యేకతను, సాపేక్షతను అధ్యయనం చేసేటప్పుడు మనం ప్రధాన వైరుధ్యానికీ, అప్రధాన వైరుధ్యాలకూ మధ్య; ఏ వైరుధ్యంలోనైనా ప్రధాన పక్షం(కోణం), అప్రధాన పక్షాల నడుమగల తేడాలపట్ల శ్రద్ధ వహించాల్సి వుంటుంది. పోతే ఒక వైరుధ్యపు విశ్వజనీనతను అధ్యయనం చేసేటప్పుడు మనం వివిధ పోరాట రూపాల మధ్యగల తేడాలపట్ల శ్రద్ధ చూపాల్సివుంటుంది. లేకపోతే మనం తప్పులు చేస్తాము. పైన వివరించిన సారవిషయాల్ని మనం అధ్యయనంద్వారా నిజంగా అవగాహన చేసుకుంటే, అప్పుడు మన విప్లవ ప్రయోజనాలకు విఘాతకరమైన, మార్క్సిజం-లెనినిజం ప్రాథమిక సూత్రాలకు విరుద్ధమైన, పిడివాద భావాలను మనం నిర్మూలించగలుగుతాము. అలాగే, యిందుమూలంగా, ఆచరణగత(వ్యవహార) అనుభవంగల మన కామ్రేడ్లు తమ అనుభవాలను తగు సూత్రాలుగా వ్యవస్థీకరించుకోగల్గుతారు; తద్వారా అనుభవవాద పొరపాట్లు పునరావృతంకాకుండా జాగ్రత్త పడగల్గుతారు. వైరుధ్య సూత్రంపై యిప్పుడు మనం చేసిన అధ్యయనంనుండి సంగ్రహంగా మనం తెలుసుకోగలిగిన కొన్ని సులభసామాన్య విషయాలివే.



ప్రచురణ సంఖ్య 24, నవంబరు 1998 వెల : 10 రూ.

# మా ప్రచురణలు

| వ. సం. | శీర్షిక, రచయిత | వెల రూ = పై |
|---|---|---|
| 1. | ***Role of Revolutionaries in the Freedom Struggle***<br>I. Mallikarjuna Sharma [only a few copies remaining] | 144 = 00 |
| 2. | **మన పరిస్థితులు – మన విధానాలు,** ఇం. మల్లికార్జున శర్మ | 20 = 00 |
| 3. | **భారతదేశ ద్వితీయ స్వాతంత్ర్య సంగ్రామం**<br>డా. భూపేంద్రనాథ్ దత్త, అను : ఇం. మల్లికార్జున శర్మ | 20 = 00 |
| 4. | **కమ్యూనిజం సూత్రాలు,**<br>ఫ్రెడరిక్ ఏంగెల్సు , అను : ఇం. మల్లికార్జున శర్మ | 10 = 00 |
| 5. | ***Easter Rebellion in India: The Chittagong Uprising***<br>I. Mallikarjuna Sharma | 360 = 00 |
| 6. | **కార్మికోద్యమ కర్తవ్యాలు,**<br>శంకర్ గుహ్ నియోగి, అను : ఇం. మల్లికార్జున శర్మ (HB) | 40 = 00 |
| 7. | **హేతువాది దృష్టిలో భగవద్గీత,** ప్రతాప రామసుబ్బయ్య (HB) | 50 = 00 |
| 8. | ***Remembering Our Revolutionaries***<br>Prof. Satyavrata Ghosh, Ed : I. Mallikarjuna Sharma | 300 = 00 |
| 9. | **కల్లోలిత కాశ్మీరం,** ఇంగువ మల్లికార్జున శర్మ | 25 = 00 |
| 10. | ***On Revolution and Socialism***<br>Seminar Souvenir, Ed : I. Mallikarjuna Sharma | 120 = 00 |
| 11. | **ఆచరణ గురించి,** మావో సే టుంగ్, అను : ఇం. మల్లికార్జున శర్మ | 4 = 00 |

**ఉత్తర ప్రత్యుత్తరాలకు (for correspondence) :**




మార్క్సిస్టు అధ్యయన వేదిక ( **Marxist Study Forum** )
6-3-1243/116, **D. Sanjeevaiah Nagar, Opp. Raj Bhavan**
హైదరాబాదు ( **Hyderabad** ) - **500 082.**

**Printed and Published by Marxist Study Forum, Hyderabad - 500 082.**

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA110B116 |
| పుస్తకం పేరు | వాల్మీకిచెప్పిన రామాయణగాథ |
| తారీఖు | 21 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Haseena |
| పేజీలు విడదీసినది | Haseena |
| స్కాన్ చేసినది | K Daveen |
| పరీక్ష చేసినది | nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |